First Edition, 5,000 Copies,
April, 1960.

# Meeku Avasaramina Vaidya Vivekam
## (Asaankraamika Vyaadhulu)

*Telugu version of*
***Medicine for the Layman: Non-communicable Diseases.***

by
K. S. Sanjivi, M. D.,
Prof. of Medicine, Madras Medical College (Retired)
*Translated by Dr. Tejomurthula Gurunatham*

---

Published under the auspices of
The Southern Languages Book Trust, Madras,
Telugu 55

---

Price Rs. 1-25 nP.



Published by
GUNDIMEDAS
Powerpet : : Eluru.

Printed at Mumukshuvu Mudranalayamu, Eluru.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధద్రావిడ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధవిషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మనదేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం ఆ మహా పురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకొని ఉండటం అవసరం.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం – ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాట్యకళ, శిల్పశాస్త్రం, పురావస్తుపరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి.

విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకిఅనువదింపజేయటం ఈద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తి గల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచడానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రముగతిని సఫలముకాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7 అక్టోబరు 1958.

ఇట్లు.
ఏ. లక్ష్మణస్వామి ముదలియార్.
వైస్ ఛాన్సెలర్.
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతము

ఆరోగ్య జీవనమును, వివిధ రోగహేతువులను సుబోధకంగా సరళంగా వివరించే గ్రంథాల ఆవశ్యకత నేడు సర్వత్ర గుర్తిస్తున్నారు. "మీకు అవసరమైన వైద్య వివేకం - అసాంక్రామిక వ్యాధులు" అనే ఈ ఉపయోగకరమైన గ్రంథం దక్షిణభాషాపుస్తకసంస్థ సహకారంతో ప్రకటితమవుతూండటం ముదావహం.

అసాంక్రామిక వ్యాధులు మానవ శరీరంలోని ఏ యే మండలాలలో ఏ విధంగా ఉద్భవించి వ్యాప్తి చెందేదీ ఈ గ్రంథకర్త నిరూపించారు. మానవ శరీరంలోని వివిధ అవయవాల ధర్మాలను, ఆ యా రోగలక్షణాలను కూడా వివరించారు. ఇట్టి గ్రంథాలు పాఠకులకు ప్రాణప్రదములైన రహస్యాలను తెలుపడంతో పాటు, ఇట్టి గ్రంథాలను ఇంకా ఎక్కువగా చదవాలనే ఆసక్తిని కూడా పెంపొందించ గలవు.

ఆరోగ్యరక్షణకు, వివిధ రుగ్మతలకు సంబంధించిన ప్రాథమిక విషయాలు తెలిసికొనగోరే వారందరికీ ఈ గ్రంథం అత్యంత ప్రయోజనకారి.

ఈ గ్రంథరచయిత డాక్టర్ కె. ఎస్. సంజీవి చిరకాలం మద్రాసు వైద్యకళాశాలలో ఆచార్యులుగా పనిచేసిన అనుభవజ్ఞులు. ఈ పుస్తకము సర్వే సర్వత్ర ప్రశంసా పాత్రం కాగలదని నా విశ్వాసం.

మద్రాసు,
29 డిసెంబరు 1958.

ఎ. లక్ష్మణస్వామి ముదలియార్
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయము.

# విషయసూచిక

# పిహెచ్‌సి స్థాయికి అవసరమైన వైద్య వివేకం

## (అసాంక్రామిక వ్యాధులు)

# 1 పుట్టుకతో కలిగెడి శరీర వికారములు

ఈ అధ్యాయములో ఆ యా మనుజులకు పుట్టుకతో శరీరము నందు కలిగెడి వివిధమైన శారీరక వికారములను గూర్చియు, ఆయా ధాతువులలో కలిగెడి మార్పులచే, పుట్టిన తరువాత కొంతకాలమునకు ఉత్పత్తిచెందు ధాతువికారములను గురించియు చర్చింప దలచితిని.

పుట్టుకతో వచ్చెడి వ్యాధులు ,వికారములు, వైకల్యములు - వీనిని సహజ వికారములు అని (Congenital anamolies) పేర్కొన వచ్చును. ఇట్టివి - పెదవి తొఱ్ఱి (Harelip) అంగుడు పగులు (Cleft Palate దీనినే గ్రహణం మొర్రి అని కూడా అందురు), కాలికి లేక చేతికి ఆరేసి వేళ్ళుండుట, వంకర పాదములు (Talipes) మొదలైనవి. ఈ వికృతులు అసలు గర్భోత్పత్తి క్రమములోనే అంత రములో ఏవో మార్పుచే కలుగు చున్నవి. ఇట్టి అంగ వికృతులు ఆ ఒక్క-

వ్యక్తికే గాక అతని వంశపారంపర్యముగా కూడా కొన్నిచోట్ల కనిపించు చున్నవి.

ఇవే గాక యింకను శరీరములో కలగెడి ధాతువికృతులు, పైకి కనపడకుండా ఉండెడివి. చాలా కలవు. ఇట్టి మార్పులు చూపరులకు కానరాకపోవుటయేగాక, అవిగల వ్యక్తికి కూడ తెలియకుండగా నుండును. ఉదాహరణకు, ఒకనిలో తన రక్తములోని ఎఱ్ఱకణములు ఒకవిధమైన పెళుసుదనమును జన్మతోనే చెంది, అవి తమయందుండెడి రంగును గోల్పోవుటచే కొన్ని కొన్ని రోగములు సంభవించుచుండును. రక్తమునకు సంబంధించిన యింకొక వ్యాధిలో రక్తము స్రవించినపుడు అది పేరుకొను స్వభావము కోల్పోవుటచే, ఏదైన స్వల్పగాయము తగిలినప్పటికిని ఆరోగ్యవంతుల రక్తము గడ్డకట్టునటుల ఈ రక్తము గడ్డకట్టక, అదేపనిగా కారిపోవుచూ అధికరక్తక్షయము కలుగ వచ్చును. ఈ వ్యాధిని రక్తస్రావము అందురు (Haemophilia).

చిత్రమైన ఈ వ్యాధి ఒకొక్క వంశములో పరంపరగా కలుగుచూ, స్త్రీలను బాధించకపోయినప్పటికి, వారి ద్వారా మగ సంతతికి సంక్రమించుచూ బాధించుచుండును. ఈ రక్తస్రావమనెడి వ్యాధి కలవారికి అతి స్వల్పముగా గాయము కలిగి నపుడు, చాల జాగ్రత్తగా శస్త్ర చికిత్స చేసినను కూడ, వారి రక్తస్రావమును ఆపుట చాలా కష్టసాధ్యమగును. ఇదే విధముగా కొంత మందికి వారి మూత్రపిండ ములలోగాని, వూపిరి తిత్తులలోగాని, నీటి కంతులు (Cysts) జన్మతోనే కలుగుటచే ఆ యా అవయవములయందు వికృతులు సహజముగా యేర్పడు చుండును.

పుట్టుకతో సంభవించెడి హృదయ వికృతికూడ కలదు. ఈ సహజ హృదయ వ్యాధిలో ధమనులు (శరీరములో వివిధ భాగములనుండి

హృదయమునకు రక్తమును కొనిపోవు నాళములు) సిరలు, (హృదయమునుండి వివిధభాగములకు రక్తమును కొనిపోవు నాళములు) వీనిలో అనేక విధములుగా వాని ఆకారములలో వికృతులు కలిగి శిశువు పుట్టును. ఈ ధమనులయందు, సిరలయందు కలిగెడి సహజ వికృతులను సరిజేయుటకు ప్రయత్నములు విశేషముగా ఇటీవల జరిగినవి. ఈ విజ్ఞానాభివృద్ధి యంతయూ ఉరశ్శస్త్ర (Thoracic Surgery) అనెడి శస్త్రచికిత్సా విభాగమునకు చెందియున్నది. పుట్టగానే యిట్టి వికృతిచే బాధపడుచూ సహజముగా రక్తప్రసారము లేమిచే నల్లబడిపోవుచుండు శిశువు పూర్వకాలములో శీఘ్రముగా మరణోన్ముఖమై యుండెడిది. అట్టిది నేడు సరియైన యీ ఉరశ్శస్త్ర (Thoracic Surgery) చికిత్సావిధానముచే తిరిగి జీవించగలుగుచున్నది. తరచుగా ఇట్టి సహజ హృదయ వికృతులు ఆ శిశువు తల్లి గర్భమందున్న మొదటి మూడు మాసములలోను తల్లికి కలిగెడి జర్మనీ పొంగు (German Measles) అనెడి వ్యాధివల్ల సంభవించుచున్నవని కనుగొనబడినది. జర్మనీ పొంగు అనెడి వ్యాధి. సూక్ష్మదర్శినీ యంత్రములోకూడ కానరాక, వాయువు ద్వారా వ్యాపించగల ఒక జాతి అత్యంత సూక్ష్మజీవుల వలన కలుగుచున్నది (వీనిని వైరస్ లందురు. Viruses) వీనిలో అనేక జాతులుకలవు. జర్మనీ పొంగును కలుగజేయు ఈ జాతి మరికొన్ని రకముల అత్యంత సూక్ష్మజీవులుగూడ తల్లిగర్భములో శిశువు నావరించుకొనియుండు మావినిగూడ చొచ్చుకొని, శిశువు శరీరమునుజేరి, ఆ పుట్టబోవు శిశువు యొక్క హృదయము మొదలైన అవయవములను యుక్తముగా ఏర్పడనీయకుండా చేయగలవనుటకు సావకాశము గలదు.

కొన్ని కొన్ని సహజవ్యాధులలో ఆ వంశ పరంపరాగతిని బట్టియు, ఆ వంశములోనే తరచు సంభవించుట బట్టియు, ఇట్టి సహజ

వ్యాధులు అత్యంత సూక్ష్మజీవులు మొదలైన వాహ్యాకారణములచే కలుగుచున్న వనుటకు నిదర్శనము లేకపోవుటచే, అది పుట్టుటకు ఆ గర్భిణీ స్త్రీ శరీరములోనే, మనకు స్పష్టము కాని అంతరగ్రంధులకు సంబంధించెడి అభ్యంతర కారణములేవో యున్నవని మనము తెలుసుకొనవచ్చును.

వైరసు లనబడెడి ఈ అత్యంత సూక్ష్మజీవులలో కొన్ని రకములు గర్భము నావరించుకొనియుండు మావిని కూడ జొచ్చుకొనిపోయి ఆ శిశువుయొక్క ధాతువులలోను, అంతరావయములలోను అనేకవిధములైన మార్పులను, వికృతులను కలుగజేయగలవని యిదివరకు చెప్పి యున్నాముగదా. ఈ వైరసులకంటె పెద్దవైన సూక్ష్మజీవులు (ఇవికూడ మన కంటికి మామూలుగా కనబడవు. సూక్ష్మదర్శిని యంత్రములోనే కనబడును) తల్లి గర్భములోని శిశువు నావరించుకొని యుండు మావి యను పొరను జొచ్చుకొని పోజాలవు. కాని సవాయి వ్యాధిని కలుగజేయు ఫిరంగ సూక్ష్మక్రిమి (Treponoma Pallidum) యీ సూత్రమునకు ఒక అపవాదము. ఈ ఫిరంగ సూక్ష్మక్రిమి తల్లిగర్భములో శిశువు నావరించుకొనియుండు పొరను కూడా జొచ్చుకొనిపోయి, శిశు శరీరములోనికి వ్యాపించి, ఒకప్పుడు దాని అవయవాభివృద్ధికి ఆటంకము కలిగించకపోయినను, ఆయా ధాతువులను కలుషము చేయుటచే జననమైన తరువాత కూడ శిశువునకు కొన్ని వ్యాధులు కలుగునటుల చేయవచ్చును.

పైని జెప్పిన కొన్ని అభ్యంతర కారణములవలన గర్భస్థ శిశువుయొక్క ఎఱ్ఱకణముల తయారులోనే ఏర్పడు ఒక సహజ వికారము కలదు. దానిలో శిశురక్తకణములు ఒక్కొక్కచోట గుమి

గూడుచు విశేషముగా నశించిపోవుచుండును. అందువలన జననమైన తరువాత అశిశువునకు కామిల, పాండుత్వము మొదలయిన లక్షణములు కలుగుచుండును. ఈ సహజ వికారమును గర్భస్థ రక్తకణచయము (Erythroblastosis foetalis) అని మనము పిలువ వచ్చును. కొంతమంది గర్భస్థ శిశువుల రక్తములో కొన్ని అంటిజెన్నుల (రక్షణ శక్తినుత్పత్తి జేయుటకై ఉపయోగింపబడు కొన్ని బాహ్యపదార్థములు) కొన్ని అంటిబాడీల (రక్షణశక్తిని కలుగజేయునట్టి కొన్ని తయారైన పదార్థములు) సంఘర్షణముచే ఈ వ్యాధి కలుగుచున్నదని చెప్పబడినది. ఆ శిశువుయొక్క తండ్రి రక్తములో ఆర్ హెచ్. భాజకపు రూఢి (Rh factor+) యుండి, తల్లి యొక్క రక్తములో ఆర్ హెచ్. భాజకపు వ్యతిరేకము (Rh–)ఉన్నప్పుడు(ఈవిషయము వారివారి రక్తములను పరిక్షజేయుటచే తెలియును) ఆ దంపతులకు పుట్టు శిశువు యొక్క రక్తములో ఆర్ హెచ్. భాజకపురూఢి (తండ్రిద్వారా) సంక్రమించి ఇది తిరిగి తల్లియొక్క రక్తములో నుండు ఆర్ హెచ్. భాజకపు వ్యతిరేకములోకలిసినప్పుడు శిశువుతాలుకు ద్రవ్యములు,అంటిజెన్నులై, తల్లియొక్క రక్తములో అవి అంటిబాడీల నుత్పత్తిజేసి, అవి తిరిగి మావిద్వారా శిశురక్తమును జెందినప్పుడు, ఈ సంఘర్షణ యేర్పడి. అందువలన శిశువునకు రక్తకణ నాశముకల్గి, పై వ్యాధి సంభవించు చున్నదని తెలియుచున్నది. ఈ ఆర్ హెచ్. భాజకమును గుర్తించిన తరువాత రక్తద్రవము విషయమై (Plasma), రక్తిమ (Haemoglobin) విషయమై అనేక విధములైన పరీక్షలు జరిగి, వానినిబట్టి రక్తమ పేరుకొనుట, రక్తస్రావము, రక్తకణనాశము మొదలయిన పరిస్థితుల ఏవిధముగా సంభవించుచున్నవి యను విషయములనుగూర్చి పరిశీలన విశేషముగా జరిగినది.

శిశువులకు కలిగెడి ఇట్టి సహజ వికృతులకు వంశ పరంపరగా వచ్చుచున్నదనెడి అనువంశిక ప్రకృతి (Diathesis) ఎంతవరకు కారణమను విషయమును యోచింపవలసియున్నది. మధుమేహము, హెచ్చు రక్తపుపోటు, మేహరంజి దగ్గు మొదలయిన ఎల్లెర్జి వ్యాధులు (ఈ ఎల్లెర్జీ వ్యాధులు కొన్నివస్తువులు, గాలి, వాతావరణము మొదలయినవి పడకపోవుటవలన కలుగును), పరిణామములతో కూడియుండు ఆమాశయ వ్రణము (Peptic ulcer), పుట్టకురుపు (Cancer) మొదలయిన వ్యాధులలో ఆ యా కుటుంబముల అనువంశిక ప్రభావమున్నదని మనము తరుచుగా అనుకొనుచుందుము. కాని, ఈ వికృతులలోను, వ్యాధులలోను గర్భ సంబంధమైన కారణములు, అత్యంత సూక్ష్మజీవులు, ఫిరంగ సూక్ష్మ క్రిములు మొదలయినవి శాస్త్రీయముగా కారణములని గ్రహించి యున్నాము. క్షయవ్యాధి, కుష్ఠువ్యాధి మొదలయినవి వంశపారంపర్యముగా కలుగునని స్థూలముగా మనము అనుకొనుచుందుము. గాని నిజమునకు ఆ వ్యాధులు, పుట్టిన తరువాత ఆ వ్యాధి కలిగియున్న తల్లియొక్కగాని ఇతరుల యొక్కగాని సంపర్కములచే సంక్రమించుచున్నవని తెలిసికొనవలెను. ఇట్టి శిశువునకు కలిగెడి వికృతులలోను, కొన్ని వ్యాధులలోను తండ్రి ద్వారానో, లేదా తల్లిద్వారానో మనకింతవరకు తెలియని కారణములు ఏవో జేరుచున్నవనియును, వానిచే శిశువు పుట్టిన తరువాత కొంత కాలమునకు ఆ వ్యాధులు, వికృతులు, కలుగుచున్నవనియును మనము తెలిసికొనవలెను. ఆ కారణములేవో ఇంతవరకును తెలియలేదు. ఈ అజ్ఞానమును కప్పిపుచ్చుటకు వైద్యులు ఒక్కొక్కప్పుడు 'అనువంశిక తత్వమే కారణము' అనెడి సాంకేతిక భాషను ఉపయోగించుచున్నారు.

## 2 ఆహారము : వ్యాధి

మోటారుకారు, మిల్లు మొదలయిన యంత్రములు పనిజేయుటకు పెట్రోలు, నూనె మొదలయిన శక్తినిచ్చు పదార్థములు ఎట్లు అవసరమో అదేవిధముగా శరీరమను యంత్రము పనిజేయుటకును, అందులో అవసరమైన వేడిమి పుట్టుటకును తగిన ఆహారము అందరికిని అవసరమై యున్నది. యంత్రశక్తిని కొలుచునప్పుడు - ఇన్ని గుర్రముల శక్తి యనియు, కాంతిని కొలుచునపుడు ఇన్ని కొవ్వువత్తులకాంతి యనియు, ఏ విధముగా మనము గుర్రములశక్తిని, కొవ్వువత్తుల కాంతిని, యంత్ర శక్తికి, కాంతికి. కొలమానములుగా తీసికొందుమో, అదేవిధముగా శరీరములో ఆహారముచే నుద్భవించెడి వేడిమి లేక శక్తిని కొలుచుటకు కెలోరీ లనెడి కొలమానములు వైద్యశాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. అన్ని వయస్సులలోను శరీరములో జరుగు పనులకును, బాల్యము నుండియు కొంత వయస్సు వచ్చువరకు శరీరము పెరుగుచుండును కావున ఆ పెరుగుదలకును, అప్పుడప్పుడు ఆ యా అదనపు పనులు,

వ్యాధులు మొదలయిన వానిచే శరీరములో కలుగుచుండెడి కొన్ని భాగముల అరుగుదలను భర్తీచేయుటకును, తగిన ఆహారము అందర కును ముఖ్యావసరమై యున్నది.

మన ఆహారములో మాంసకృత్తులు, పిండిపదార్థములు, కొవ్వు పదార్థములు శరీరమునకు కావలసినన్ని కెలోరీల వేడిమిని, లేక శక్తిని కలుగజేయును. ఈ విధముగా ఒక గ్రాము (సుమారు 15¼ వడ్లగింజల ఎత్తు) మాంసకృత్తులు 4.1 కెలోరీల వేడిమిని, ఒక గ్రాము కొవ్వు పదార్థము 9.3 కెలోరీల వేడిమిని ఉత్పత్తి చేయును. మనదేశములో ఏమియు కాయకష్టము చేయనిమనిషికిగూడ రోజునకు 2,160 కెలోరీల ఉష్ణముశరీరములో పనివలన ఖర్చు అగుచుండునని తెలియుచున్నది. ఇక ఆ మనిషిచేయుపనినిబట్టి ఇంకను ఎక్కువ కెలోరీల వేడిమి పుట్టించెడి ఆహారమును ఆతడు తినవలసియున్నది. భారత ప్రభుత్వము వారు జారీచేసిన నెం. 23 ఆరోగ్య ప్రచురణలో మనదేశములో వివిధమైన ఆహారముల వలన కలుగు శక్తివిలువలు, వానినిబట్టి ప్రతి వ్యక్తియు తన ఆహారము విషయమై తగు ప్రణాళిక వేసికొనుటకు వీలుగా నుండుటకు దగిన విషయము నిర్ధారణము చేయబడి యున్నవి.

శరీరములో కావలసిన శక్తిని, బలమును కలుగజేయుటకు ఈ మాంసకృత్తులు, పిండి పదార్థములు, కొవ్వుపదార్థములు మాత్రము చాలునని నిర్ణయింపబడినను, తరువాత శాస్త్రపరిశోధనలచే ఇవేగాక ఇంకను విటమినులు, కొన్ని ఖనిజ లవణములు, నీరు కూడ అవసర మని నిర్ధారణ అయినది.

హిందూదేశమువంటి బీదదేశములో సాధారణముగా మన పయోగించెడి ఆహారములలో మాంసకృత్తులు విటమినులు, కొంత

వరకు కొరతగా నున్నవని శాస్త్రజ్ఞులు కనుగొని యున్నారు. అయితే ఈ కొరత ఇంచుమించు కొద్దిగానో గొప్పగానో ప్రపంచములో అన్నిదేశములలోను ఉన్నది. మరియు, ఆహారములో ఈ మాంసకృత్తుల కొరత కేవలము మొత్తము కెలోరీల సంఖ్యతక్కువవలననే గాకుండగా, ఆ ఉపయోగించెడి మాంసకృత్తుల ప్రాశస్త్యమును బట్టిగూడ ఏర్పడుచున్నది. ఉదాహరణకు కేవలము పప్పులు మొదలయిన శాకపదార్థముల నుండి మనకు లభ్యమయ్యెడి కెలోరీల సంఖ్య ఎక్కువగా నున్నను, అవి పాలు, మాంసము మొదలయిన జంతు సంబంధమైన పదార్థముల నుండి వచ్చు కెలోరీల వలె శరీరములో అవయవ నిర్మాణమునకు అంతగా ఉపయోగ పడజాలవు. ఎందుచేతననగా, ఆహారములోని మాంసకృత్తులు శరీరములో ఎమీనామ్లములు అను ద్రవ్యములుగా మారి పోవలయును. శరీరములో కణముల నిర్మాణమునకు ఈ ఎమీనామ్లములు ఇటుకలవంటివి. అందుచే ఏ ఆహారము నందలి మాంసకృత్తులకైనను వాని యందుండెడి ఎమీనామ్లములను బట్టి వాని ప్రాశస్త్యము హెచ్చు తగ్గులుగా నుండును. ప్రతి వ్యక్తియు తాను తినెడి ఆహారములో తగిన మాంసకృత్తులు వినియోగము లోనికి వచ్చుటకు అధమము అయిదవ వంతైనను పాలు, పెరుగు, మజ్జిగ రూపముగా ఆ మాంసకృత్తులు తీసికొనవలయును. వయస్సు, శరీరము యొక్క లావు మొదలయిన వానిని బట్టి మారినను, సాధారణముగా ప్రతి వ్యక్తి యొక్క ఆహారములో 50 మొదలు 80 గ్రాముల మాంసకృత్తులు ఉండవలయును.

అదే విధముగా క్రొవ్వు పదార్థములలో గూడ అందు లభించెడి జాంతవ, శాక సంబంధమైన పదార్థములను బట్టి- అనగా ఈ క్రొవ్వు పదార్థములనుండి వచ్చు రక్తద్రవము (ప్లాస్మా) లోని కొలెస్టెరాల్

మొదలయిన ద్రవ్యముల ఆధిక్యత బట్టి, ఆ కొవ్వు పదార్థముల ప్రాశస్త్యములో తేడాలు వచ్చుచున్నవి. ఈ రక్తద్రవములోని కొలెస్టెరాల్ మొదలయిన వానిని బట్టి శరీరములో ధమనులు పెళుసెక్కిపోవుట (ధమనీ కాఠిన్యము) మున్నగు లోపములు, వాని ననుసరించి కొన్ని వ్యాధులును కలుగు చుండును. ఈ ధమనీ కాఠిన్యమను వ్యాధి పాశ్చాత్య దేశములలో ఏ విధముగా ప్రబలి మరణములను విశేషముగా కలిగించు చున్నది అనెడి విషయము ఇంకొకచోట చెప్పెదము. అందుచే ఆహారమునకు ఈ ధమనీ కాఠిన్యమునకు గల సంబంధము విషయమై ఎంతయో పరిశోధన ఇటీవల జరిగి యున్నది. ఇంకొక చిత్రమేమనగా, జంతుసంబంధమైన మాంసకృత్తులు శాకములనుండి వచ్చు మాంసకృత్తుల కంటె శ్రేష్ఠములైనను, కొవ్వుపదార్థముల విషయములో మాత్రము అట్లు కాదు. జంతు సంబంధమైన కొవ్వుపదార్థమైన వెన్నలో 'ఎ' విటమిను కలదనియు, అందుచే అది మాత్రము శ్రేష్ఠమైన దనియు, గుర్తించవలెను,

మన దేశములో సాధారణముగా జనులు భుజించు ఆహారములో పిండిపదార్థములు అవసరమైన వానికంటె హెచ్చుగా నుండుటచే, అది సమీకృతాహారము (Balanced Diet) కాజాలకున్నది. ఈ పిండి పదార్థములను హెచ్చుగా తీసికొనినప్పుడు శరీరములో ఇన్సులిన్ మొదలయిన అంతస్స్రావముల కొరత ఏ మాత్రమైనను ఉన్నయెడల అప్పుడు మధుమేహము లేదా మూత్రములో చక్కెరపోవుట అను వ్యాధి కలుగవచ్చును. ఈ వ్యాధిని తరువాత వివరముగా చర్చించెదము.

ఈ పిండి పదార్థములుకూడ శరీరములో సరిగా వినియోగము చెందుటకు కొంతవరకు బి ఒకటి (అను విటమిను) గాని, తయామిన్ హైడ్రోక్లోరైడ్ అనెడి విటమినుగాని అవసరమైయున్నది. బియ్యపు

గింజను అంటియుండు పొరలోను, బీజములోపునను కూడ ఈ బి విటమిను కొంతవరకు ఉన్నది. నేటి నాగరికతా ప్రభావమేమనగా, మానవుడు సహజముగా బియ్యపు గింజలోఉన్న విటమినును మిల్లులో బియ్యమును తెల్లగా ఆడించుటచే గోల్పోవుచు, ఆ విటమిను లోపముచే వచ్చు వ్యాధులకు ఆ విటమినునే కృత్రిమముగా బిళ్ళల రూపములో గాని, టానిక్కుల రూపములోగాని ఉపయోగించుచు, డబ్బు ఖర్చుపెట్టు చున్నాడు. పూర్వము మనవారు దంపుడు బియ్యము, పాలు, కాయ గూరలు మొదలయిన వానిని ఎక్కువగా ఉపయోగించువారగుటచే ఇప్పటి వారికంటె హెచ్చుగా ఆరోగ్యవంతులుగా నుండెడి వారనుట చాల మట్టుకు సత్యము.

ఈ ఆహారములో ఆ యా పదార్థముల కొరతలచే అనేక రకములుగా వ్యాదులు అనేక విధములైన కారణములచే పుట్టుచున్నవి. దరిద్రుడైన ఒకడు తగినన్ని కెలోరీల నిచ్చెడి యుక్తాహారమును సంపాదించలేక వ్యాధిని తెచ్చుపెట్టుకొనుచుండగా, ధనవంతుడైన వాడింకొకడు అట్టి సమీకృతాహారమును తినుటయందు ఇష్టములేకనో, లేదా విషయము తెలియకనో, కొన్ని వ్యాధులను తెచ్చిపెట్టు కొను చున్నాడు. ఇంకొక విషయమేమనగా, ఒక్కొక్కడు ఈ విటమినుగల ఆహారమును తిన్నను, అది సరిగా అరగకనో, లేదా సరిగా వంట బట్టకనో కొన్నివ్యాధులతో బాధపడుచుందురు. కొందరికి కొన్ని కొన్ని విటమినులు లోపించుటచే కొన్ని వ్యాధులు కలుగును.

అయితే, ఆహారములో కెలోరీలు హెచ్చుగా లోపించుట, బి. విటమిను, సి. విటమినులు మిక్కిలి తక్కువగుట, ఈ లోపములచే గలిగెడి బెరి బెరి (మేహానంజు), స్కర్వీ (ఇది సి. విటమిను లోపముచే కలుగును. పండ్ల వెంబడి రక్తము [illegible] శరీరపోషణ సరిగా లేక

పోవుట మొదలయిన లక్షణము లుండును) ఇట్టి వ్యాధులు పూర్వము అమధ్యనున్నట్లు, ఇప్పుడంతగా గానరావు. కొన్ని రోజుల పాటు అసలే ఆహారము దొరకక మనిషి క్రమముగా కృశించి పోవుట నేడు చాల అరుదుగా ఎప్పుడో కానవచ్చుచున్నను, కొన్ని ఇతర కారణములచే ఆహారము తినుచున్నను కూడ ఆ యా మనుజులు మిక్కిలి చిక్కి పోవుట, తూనిక బాగా తగ్గిపోవుట అచ్చటచ్చట కనిపించుచునే యున్నది. గొంతుకలోను, ఆమాశయములోను పుట్టకురుపు (Cancer) మూలముగా ఆహారము నుంచినను అది దిగక పోవుట, మెడలో నుండు థైరాయిడ్ గ్రంథి (గ్రైవేయక గ్రంధి)లో ఎక్కువగా స్రావమూరుటచే కలిగెడి వ్యాధి, చిరకాలమునుండి వచ్చు జ్వరము మొదలయిన వ్యాధులచే శరీరమునకు తగిన పోషణ లేకపోవుటచే చిక్కిపోవుట- ఇవి సంభవించుచునే యున్నవి.

ఇక మానవుడు ఆరోగ్యముగ జీవించుటకు శరీరనిర్మాణమునకు ఆధార భూతములైన రాసాయనిక ద్రవ్యములలో అయోడిన్, కాల్షియం (సున్నము), ఐరన్ (ఇనుము), సోడియం, పొటాషియం మొదలయినవి ముఖ్యపాత్ర వహించుచున్నవి. కొంత మందికి మెడయందు కంతివలె నుండు 'గాయిటర్' అని పిలువబడు వ్యాధి ఆతడు తినెడి ఆహారములో అయోడిను అనెడి పదార్థము యొక్క లోపముచే కలుగుచుండును. గ్రైవేయక (థైరాయిడ్) గ్రంథికి సంబంధించిన ఈ వ్యాధిని ఇంకొకచోట చర్చించెదము.

ఆహారములో కాల్షియం (లేక సున్నము) శరీరములో ఎముకల నిర్మాణమునకును పోషణకును, అవసరమైయున్నది. ఒక్కొక్కప్పుడు ఆహారములో ఈ కాల్షియం ఎక్కువగా నున్నప్పటికిని అది శరీరములో ఇముడుటకు. అనగా వినియోగములోనికి వచ్చుటకు, 'కాల్సిఫెరాల్'

లేక విటమిను 'డి' అనెడి ద్రవ్యము అవసరమై యున్నది. ఆహారము లోని కొన్ని కొవ్వు పదార్థముల ద్వారా ఈ విటమిను 'డి' శరీరములోనికి గ్రహింప బడవచ్చును. లేదా సూర్యకాంతి శరీరముపై ప్రసరించినచో ఆ సూర్యకాంతిలో ఇమిడియున్న విటమిను 'డి' శరీరములోనికి సంక్రమించును. అందుచే ఇచ్చట తెలిసికొనవలసిన విషయమేమనగా, ఏయే ప్రదేశములలో జనులపై సూర్యరశ్మి లేక ఎండ అరుదుగాను చాల తక్కువగాను పడుచుండునో ఆ ప్రదేశములలో జనులు తరచుగా అస్థిమార్దవము (దీనిని'రికెట్సు' అని అందురు. పిల్లలకు కలుగుచుండును. ఇందులో ఎముకలలో గట్టిదనము తగ్గి మృదుత్వము ఎక్కువగుటచే ఆ ఎముకలు వంగిపోవుట కూడ తటస్థించును), అస్థిశైథిల్యము (ఆస్టియోమలేషియా అనువ్యాధి. ఇది రికెట్సు వ్యాధివలెనే పెద్దవారికి కలుగును, ఎముకలు వంగుట, క్షీణించి పోవుట, మొదలయిన లక్షణము లుండును.) మొదలయిన వ్యాధులు కానవచ్చుచున్నవి. ఈ అస్థిశైథిల్యమనువ్యాధి ఉత్తర హిందుస్థానములో జనానా లేక ఘోషా ఎక్కువగా నుండు స్త్రీలలో ఎక్కువగా కానవచ్చినది. స్త్రీలకు కాన్పులు ఎక్కువగుటచే వారిలో కాల్షియం లేక సున్నము తగ్గిపోవుటకూడ ఈ వ్యాధికి కారణమై యున్నది.

రక్తములో ఎర్రకణములలోని ఎరుపురంగుకు ఇనుము ముఖ్య కారణము. ఈ విషయము పాండు రోగముల చర్చలో వివరించెదము.

శరీరములో వివిధమైన కణములలోను రక్తములోను గూడ సోడియం, పొటాషియం అనెడి ద్రవ్యములు సరియైన పాళ్ళలో నుండవలయును. శరీరములో నుండు నీటికిని ఈ ద్రవ్యములకును, పరస్పరము ఎంతో సంబంధము గలదు. ఈ విషయమై, అనగా ఆరోగ్యవంతులలో సోడియం పొటాషియం అను ద్రవ్యములకును, నీటికిని

గల పరస్పర సంబంధము విషయమై, ఎంతయో పరిశోధన చేయబడి యున్నది. పిల్లలలో వాంతులు, విరేచనములు ఎక్కువయినచో శరీర ధాతువులలో నుండు నీరు ఆ వాంతులు, విరేచనములద్వారా బయటకు పోవుటచే ఈ సంబంధము చెడిపోవును. ముఖ్యముగా పెద్దవారికి కలుగు వంజా, నీరు పట్టుట మొదలయిన వ్యాధులు ఈ సంబంధము చెడుట వలననే కలుగుచున్నవి. అతి మూత్రము లేక మధుమేహములోను హఠాత్తుగా సంభవించు మూర్ఛలోను (స్పృహ తప్పిపోవుట) కూడ ఈ సంబంధము (అనగా పొటాషియం, సోడియం, నీరు వీనికి గల సంబంధము) ఒక విధముగా చెడుచున్నది. దానివి అతి జరుగురుగా తెలిసికొని దాని ననుసరించి చికిత్సను నడిపించవలసి యున్నది. ఇట్టి పరీక్షలను త్వరితముగా జేయుటకు పూర్వకాలపు రాసాయనిక పరీక్షలకంటె 'జ్వాలా కాంతి మాన' మనెడి (Flame Photometre) ఆధునిక పరికరము ఉత్తమమైన, సున్నితమైన పరీక్షను జేయగల దగుటచే అది ప్రతి వైద్యప్రయోగశాల. (Laboratory) లోను తప్పని సరిగా ఉండవలసిన అవసర మేర్పడినది.

మానవ శరీరములో మిగిలిన పదార్థములతో పోల్చిచూచినచో నూటికి అరవై వంతులకు పైగా నీరు ఉన్నది. అయితే ఆ యా ప్రదేశములలో శీతోష్ణ పరిస్థితులు, ఆ యా జనులు చేసెడి పనులనుబట్టి శరీరమునుండి చెమట, మూత్రము మొదలయినవి ఎక్కువగా గాని, తక్కువగా గాని పోవుచుండుట, ఇట్టి కారణములపై కూడ నీటిని ఎక్కువగా గాని తక్కువగా గాని ఉపయోగించుట అను అంశము ఆధారపడి యున్నది.

ఆహారములో మాంసకృత్తులు, విటమినులు లోపించుటచే, పైని ఉదహరించిన వ్యాధులేగాక ఇంకను అనేక వ్యాధులు ఎంతచికిత్స

చేసినను తగ్గకుండ ఉండును. అందుచే ఆ వ్యాధులలో రోగి తిను చున్న ఆహారమును ముఖ్యముగా పరిశీలించవలసి యున్నది. ఉదాహరణకు క్షయవ్యాధి, మేహవాత వ్యాధియును కారణాంతరములచే కలిగినను 'ఎ' విటమిను 'సి' విటమినులు ఎక్కువగా నుపయోగించు టచే రోగి త్వరితముగా ఆరోగ్యము పొందగలడు. ఈ వ్యాధులలో తగిన ఔషధములతో పాటు ఈ విటమినులు ముఖ్యముగా పడిన ఆహారమును కూడ భోజించినచో, త్వరితముగా ఆరోగ్యము పొందుటకు ఎంతయో అవకాశమున్నది.

పాశ్చాత్య దేశములలో ధనిక వర్గములలో, ముఖ్యముగా అమెరికా సంయుక్త రాష్ట్రములలో స్థౌల్యమనెడి వ్యాధి విశేషముగా ప్రబలి యున్నది. సాధారణముగా కావలసిన దానికంటె ఎక్కువ ఆహారమును తినుటచే ఈ వ్యాధి కలుగుచున్నది. స్థౌల్యము, ఆయాసము, నీరసము మొదలయిన వానికి, కావలసిన దానికంటె ఎక్కువ ఆహారమును తినుట ముఖ్యకారణములగుచున్నవి. అయితే కొంతమందికి అంతర గ్రంధుల స్రావములలో తేడాలు వచ్చుట మొదలయిన కారణములచే గూడ ఈ వ్యాధికలుగవచ్చును. కాని ఒకే కుటుంబములో ఈ స్థౌల్యము అనేకులను బాధించుచున్నచో అచ్చట ఏమియు వ్యాయామము లేక పోవుట, కావలసిన దానికంటె అధికముగా తినుటయే ముఖ్యకారణము లని గ్రహించ వచ్చును. ఈ క్రింది ప్రయోగముచేకూడ స్థౌల్యమునకు ఎక్కువగా తినుటయే ముఖ్యకారణమనెడి అంశమును స్థిరపరచ వచ్చును. సామాన్యముగా ప్రతి మానవునకును దినమునకు 3,000 కెలోరీల శక్తి నిచ్చెడి ఆహారము కావలసియుండును. ఈ స్థౌల్యరోగికి మనము రోజుకి 1000 కెలోరీల శక్తినిచ్చు హారము మాత్రమే ఇచ్చినపుడు అతడు మిగిన రెండువేల కెలోరీల శక్తియులేక, ఆ ఉష్ణమును

తనశరీరములో నిలవయున్న కొవ్వునుండియే గ్రహింపవలసియున్నది. ఈ విధముగా ఆతనియందు కొవ్వు క్రమముగా కరిగిపోవును. ప్రతి గ్రాము కొవ్వు 9.3 కెలోరీలను ఇచ్చుచుండును గావున ఆలెఖ్ఖను ప్రతిరోజు అతనిలో 465 గ్రాముల కొవ్వుకరిగి పోవుటకు అవకాశము కలదు. ఈ స్థౌల్యరోగముకూడ కార్శ్యరోగమువలెనే (తిండి వంట పట్టక మిక్కిలి కృశించి పోవుట) ప్రాణాపాయమును కలుగజేయు ఘోరమైన వ్యాధి. ఈ స్థౌల్యరోగికి హృదయము లేక గుండెకాయకు ఎక్కువ పని తగులుటయేగాక, ఈతనికి మధుమేహము, రక్తపుపోటు మొదలయిన వ్యాధులు కలుగుటకు ఎంతయో అవకాశము కలదు. వారు తమ శరీరమునే మోయలేక, తమకు కావలసిన చిన్నపనులను గూడ చేసికొనలేక బాధపడుచుందురు. మరియు, వారికి శ్వసనక జ్వరము (న్యుమోనియా) మొదలయిన వ్యాధులు సోకుటకును, అవి ప్రాణములకే ప్రమాదమును కలుగజేయుటకును ఎంతయో అవకాశము కలదు.

మూత్రములో చక్కెర పోవుచుండుట అను వ్యాధిని మధుమేహ మందురు. ప్రతి మనిషి వాడు చేయు పనినిబట్టి, వాని శరీరములో ఆయా భాగములన్నియు పనిచేయుటకు ప్రతిదినమును అవసరమైనన్ని కెలోరీల శక్తిని ఉత్పత్తిజేయు ఆహారము అవసరమై యున్నది. ఇట్టి ఆహారములో మిగిలిన పదార్థములతోబాటు మాంస కృత్తులు, పిండి పదార్థములు, కొవ్వుపదార్థములు సమీకృతముగా, అనగా తగినపాళ్ళలో, నుండవలయును. ఈ మధుమేహ మనెడి వ్యాధిలో, పిండిపదార్థములు శరీరములో యుక్తముగా ఇముడక, మూత్రము ద్వారా చక్కెర రూపమున బయటకు పోవుచుండును.

శరీరములో, ఉదరములోని ప్రేవులకు పైని, ఆమాశయము లేక ఆహారపు సంచి దిగువను, ఎడమ వైపున 'తిల'మనెడి (పాంక్రియాస్)

అవయవము కలదు. ఈ తిలమునుండి అవయవము కూడ మనము తిను ఆహారము జీర్ణమగుటకు అవసరమైన కొన్ని పొంగు పదార్థములు గల తిలరసమును ఉత్పత్తిజేయుచుండును. ఈ తిలములో లాంగర్‌హాన్స్ అనెడి గ్రంథులద్వారా పుట్టెడి ఇన్సులిన్ అనెడి ఒక అంతరస్రావము ఎల్లప్పుడు పుట్టుచు రక్తస్రావములో కలిసిపోవుచుండును. మన శరీరములో శక్తిని కలుగజేయు గ్లూకోజు లేక ద్రాక్షశర్కరయనెడి పదార్థము యకృత్తు లేక కాలేయములోను మాంసపేశులలోను నిలువ జేరియుండును. అట్టి ద్రాక్షశర్కరను ఈ ఇన్సులిన్ అనెడి స్రావము శరీరావసరములను బట్టి ఆయా కణములకు శక్తినందించు పనికై నియమించుచుండును. తిలములో లాంగర్‌హాన్స్ అనెడి గ్రంథులు జబ్బుపడుటచే, వాని ద్వారా ఉత్పత్తిచెంద వలసిన ఇన్సులిన్ అనెడి స్రావము చాలమట్టుకు తగ్గిపోవుటచే రక్తమునందు ద్రాక్షశర్కర ఎక్కువయి అది మూత్రముద్వారా దిగి ఈ మధుమేహమనెడి వ్యాధి కలుగుచున్నది.

మన శరీరములో పోషణక (పిట్యూటరీ) గ్రంథి, గ్రైవేయక (థైరాయిడ్) గ్రంథి, ఎడ్రినల్ గ్రంథులు (అధివృక్క గ్రంథులు) వీని స్రావములకు పరస్పర సంబంధము కలిగి యుండును. వానికిని తిలమునుండి స్రవించు తిలరసమునకు ఒక విధమైన విరోధము కలదు. అనగా ఈ థైరాయిడ్ గ్రంథి, పిట్యూటరీ గ్రంథి, అధివృక్కగ్రంథులు ఎక్కువగా పనిజేయుటచేకూడ మూత్రములో ద్రాక్షశర్కర పోవుచుండును. కాని, దానికిని మనము ఇచ్చట ప్రస్తుతము చర్చించుచున్న మధుమేహమునకు తేడాగలదు. ఇన్సులిన్ తక్కువగా నుండుటచే కలుగు మధుమేహమునే మనము ఇచ్చట విచారింపవలసియున్నది.

ఏకారణములచే తిలములో ఈ ఇన్సులిన్ అనెడి స్రావము తగ్గి పోవుచుండునో ఆ విషయము ఇంకను సరిగా తెలియలేదు. కొన్ని అంటువ్యాధులు తిలములోని కణములను పాడుచేయుటచే ఈ వ్యాధి కలుగవచ్చును. జంతువులలో చేసిన కొన్ని ప్రయోగములలో ఆ జంతువు లలో ధాతువులను బాధించు ఎల్లోక్సాను మొదలయిన ద్రవ్యములను తీసివేసినప్పుడుకూడ ఈ మధుమేహమనెడి వ్యాధి పుట్టినది. దీనినిబట్టి శరీరములో కొన్ని ఆంతరస్రావముల లోపముల వలన మధుమేహ మనెడి వ్యాధి పుట్టుచున్నదని తెలిసికొనవచ్చును. ఇంకొక విశేష మేమనగా ఈ మధుమేహమనెడి వ్యాధి ప్రత్యేకముగా ఒక్కొక్క కుటుంబములో అనేకులకు కలుగుచున్నది. బహుశా ఆ కుటుంబములలో వారి వారి శరీరములలోని కణములకు సంక్రమించిన బలహీనతవలన ఈ వ్యాధి వారిలో అనేకులకు కలుగుటకు అవకాశము ఉండవచ్చును. ఎక్కువగా భుజించుట, అందువలన పిండిపదార్థము ఎక్కువగా శరీరములో పడుట, దాని ద్వారా ద్రాక్షశర్కర ఎక్కువగుట, దానికి కావలసిన ఇన్సులిన్ ఉత్పత్తిలేకపోవుట, లేదా తక్కువ ఇన్సులిన్ ఉత్పత్తి అయి అదిఖర్చు అయిపోవుట, వీనివలనకూడ ఈ వ్యాధి కలుగుచుండ వచ్చును.

మధుమేహములో ఆహారములోని పిండి పదార్థముల యొక్క మార్పులు, వంటపట్టుట మొదలగునవి తప్పుమార్గము పట్టుటచే మూత్ర ములో ఎక్కువ శర్కర పోవుచున్నది, దానితో పాటు కలసి ఎక్కువ నీరు కూడ శరీరము నుండి బయటకు పోవుచున్నది, అతిమూత్రము, అతి దప్పిక, అతి ఆకలి ఈ మూడును మధుమేహము యొక్క లక్షణములని ఆంగ్ల వైద్యగ్రంథములందు చెప్పబడినది. కాని ఈ లక్షణములన్నియు వ్యాధిముదిరిన వారికిని, పెన్నవయస్కులకు ఈ

వ్యాధివచ్చినపుడును కన్పించుచున్నవి. కాని ఈ వ్యాధి వయస్సు ముదిరి ఎక్కువ తూనిక గలిగి ఎక్కువ స్థూలురైన వారలకు చాల కొద్ది లక్షణములతో ప్రారంభమగును. ఇట్టి వారిలో పైని జెప్పిన అతి మూత్రము, అతి ఆకలి, అతి దప్పిక, అతిస్వల్పముగా నుండుటచే ఈ వ్యాధిని ప్రారంభములో కనిపెట్టలేక పోవుదురు. ఒకొక్కక్క రోగికి కారణము తెలియకుండగనే తన శరీరములో (ముఖ్యముగా స్త్రీలకు మాన ప్రదేశములో) దురద, ఆయా పేశాలలో మేహవాతపు నొప్పులు, కంటివ్యాధులు, నెత్తురుగడ్డలు మొదలయిన వ్యాధులు, క్షయ, రక్తపుపోటు. మొదలయిన లక్షణములు కలిగినవారు డాక్టరుతో ఈ లక్షణములకై సలహా జేసినపుడు మాత్రమే ఆతడు అనుమానపడి మూత్ర పరీక్షజేసి ఈ వ్యాధిని కనుగొనుట తటస్థించును.

ఇచ్చట మూత్రపరీక్ష విషయమై ఒక మాట చెప్పవలసి యున్నది. ఉదయము పరగడుపుననే పట్టిన మూత్రమును గాక, మామూలు పిండి పదార్థములు కలిసిన భోజనమును చేసిన తరువాత విడిచెడి మూత్రమునే గ్రహించి పరీక్ష జేయవలెను. ఈ పరీక్ష అయిన తరువాత డాక్టరు గ్లూకోజు (ద్రాక్షపానీయము మొదలయిన వానిని) ఇచ్చుచు, రక్తమును తీయుచు కొన్ని విధములైన పరీక్షలను జేయును. ఆ పరీక్షలను బట్టి ఆరోగికి మధుమేహము ఏ విధముగా వచ్చి ఎంతవరకు బాధించు చున్నదియును తెలియును.

ఈ మధుమేహ రోగులకు పైని జెప్పిన లక్షణములే గాక ఒకొక్కక్కప్పుడు మగత అనగా స్పృహతప్పిపోవుట కలుగవచ్చును. ఇది చాల ప్రమాదకరమైన స్థితి. శరీరములో కొవ్వు పదార్థములు విశేష ముగా మార్పుచెందుచు కీటోనులను విషపదార్థములను ఉత్పత్తి

జేయుటచే ఈ మూర్ఛ లేదా స్పృహతప్పిపోవుట అను వ్యాధి కలుగుచున్నది.

మరియు చిరకాలమునుంచి మధుమేహము ఉన్న రోగులకు వారి రక్తనాళములు పాడయి పోవుటచే వానిలో రక్తప్రసరణము సరిగా జరుగక ప్రాణాపాయకరమైన ఉపద్రవములు కలుగవచ్చును.

చికిత్స:—చికిత్స చేయుటకు ముందు ఈ మధుమేహ రోగి యందున్న ఉపద్రవములను, లక్షణములను, వానివల్ల కలిగెడి ప్రమాదమును పూర్తిగా గుర్తించి దానినిబట్టి చికిత్సను చేయవలసియున్నది. ఇచ్చట ప్రధానముగా చెప్పవలసిన దేమనగా ఎక్కువ బరువుకలిగి స్థూలురైన మధుమేహరోగులు తమ ఆహారమును సరిజేసుకుని కొంత మితముగ భుజించినచో ఏ మందును అక్కర లేకుండగనే ఈ వ్యాధి తగ్గిపోవును. కాని ఈ వ్యాధితో బాధపడెడి మిక్కిలి చిక్కిపోయి యున్న రోగికి మాత్రము యుక్తమైన ఆహారముతోపాటు మోతాదుగా ఇన్సులిన్ ఇంజెక్షనులను చేయవలసియున్నది.

పాశ్చాత్య దేశములో ఈ ఇన్సులిన్ అను ఔషధమును బంటింగ్, బెస్టు అనెడి శాస్త్రజ్ఞులు 1921 వ సంవత్సరములో కనుగొనిరి. నాటి నుండి, నేటివరకు ఈ ఔషధము వలన కోట్లకొలది మధుమేహ రోగులు మృత్యువాతనుంచి రక్షింపబడిరి. ముఖ్యముగా మధుమేహ రోగులకు కలిగెడి మూర్ఛ, (స్పృహతప్పిపోవుట) హృదయము, మెదడు మొదలయిన భాగములలో చిన్నచిన్న రక్తనాళములలో అడ్డు కలుగుటచే ప్రాణాపాయము కలుగుట మొదలయిన ప్రమాదములనుండి రక్షింపబడుట గమనార్హము.

ప్రతి మానవునకును తన శరీరములో తిలమనెడి అవయవము (పాంక్రియాస్) ద్వారా ఆతనికి కావలసిన ఇన్సులిన్ ఉత్పత్తి యగుచుండును. మధుమేహరోగికి ఇట్టి ఇన్సులిన్ అవసరమైనంత ఉత్పత్తి కాకపోవుటచే దానిని ఇతర జంతువుల శరీరములనుండి తీసి, భద్రపరిచి ఔషధముగా తయారుచేసి ఇంజెక్షనుగా ఇచ్చుట అవసరమగుచున్నది. ఇన్సులిన్ ఇంజెక్షను ఇచ్చుట అనగా మధుమేహ రోగుల శరీరములో కొరతగా నుండు ఇన్సులిన్‌ను ఇంజెక్షను ద్వారా సరఫరా జేయుటయే. పిండిపదార్ధములను అధికముగా భుజించు మధుమేహ రోగులకు దీని అవసరము ఎక్కువగా ఏర్పడుచున్నది. ఈ విషయమును తెలిసికొనిన మధుమేహరోగులు తమ శరీరావసరములకు తగిన ఇన్సులిన్ పదార్థమును అప్పుడప్పుడు శరీరములోపలికి యుక్తముగా ఎక్కించుకొనుచు ఈ వ్యాధిని అణచిపెట్టుకొని అనేక సంవత్సరములు సుఖముగా జీవింప గలుగుదురు. ఇట్టి శ్రద్ధ తీసికొనని మధుమేహ రోగులకు ఎప్పుడో ఒకప్పుడు ఆయా ఉపద్రవములచే అపాయము కలుగుటకు హెచ్చు అవకాశము కలదు,

ఈ ఇన్సులిన్ పదార్థమును ఇంజెక్షను ద్వారానే ఈయవలయును. ఎందుచే ననగా నోటిద్వారా మింగినచో ఆమాశయములో నుండు జాఠర రసముచే అది నిశ్శక్తమై ఏమియు పనిచేయదు. ఈ ఇన్సులిన్ మందులలో అనేక రకములు కలవు. ప్రతి మధుమేహ రోగి తనశరీర స్థితికి సరిపడు ఇన్సులిన్ రకమును, దాని మోతాదును నిర్ణయించుకొనుటకు జాగ్రత్తగా కొన్నిసార్లు ప్రయోగించుచు, లోపములను గ్రహించవలెను.

అయితే ప్రతినిత్యము ఈ ఇంజెక్షనులు చేసికొనుటకు కొన్ని ఇబ్బందులు కలవు. కావున ఈ ఇంజెక్షను బదులు దానితో సమానముగా

పనిచేయు ఔషధమును కనిపెట్టవలయునని శాస్త్రజ్ఞులు చాల ప్రయత్నించిరి కాని కృతకృత్యులు కాలేకపోయిరి. కాని ఈ మధ్యనే టోల్బుటమైడ్ అను ఔషధమును కనుగొనిరి. (ఇదిసల్ఫానమైడ్సు అను ఔషధములతో రాసాయనికముగా దగ్గరసంబంధముకలది) ఈమందు ఈకొరతను చాల మట్టుకు తీర్చినది. అయితే ఒక విషయమేమనగా ఏ ఔషధమైనను అందరికి సరిపడునని అనుకొనకూడదు. అందుచే ఎవరైనను సరే, శాస్త్రజ్ఞులు కనిపెట్టిన కొత్త ఔషధమును అందరికీ ముందు మొట్టమొదటగా వాడకూడదు.

ఈ మధుమేహపు మందులవిషయమై పరిశోధన అన్ని దేశములలోను చురుకుగా జరుగుచున్నది. స్థూలశరీరులై ఉండి, ఏ ఉపద్రవములు లేక, వ్యాధి స్వల్పముగా ఈ మధ్యనే అంకురించిన వారికి ఈ ఔషధమును ఇవ్వవచ్చును. చిక్కిపోయి, వ్యాధి హెచ్చుగా చిరకాలమునుంచి ఉన్న మధుమేహ రోగులకు ఇన్సులిన్ ఇంజక్షను మాత్రమే మంచి ఫలితములను కలిగించుచున్నది.

# 3 అంతస్స్రావ గ్రంధికి సంబంధించిన వ్యాధులు

మన శరీరములో రెండురకముల గ్రంధులు కలవు. ఒక రకము గ్రంధులు తమయందుత్పత్తి జెందు స్రావములను కొన్ని నాళముల ద్వారా శరీరమునందలి అవయవములకు పంపుచుండును. కొన్ని రకముల గ్రంధులు ఏ నాళములు లేకనే రక్తములో తమ స్రావములు కలియునట్లు జేయును. ఈ రెండవ రకపు గ్రంధులకు వినాళ గ్రంధులని పేరు. అనగా నాళములు లేనివి. ఇవి తమ స్రావములను బయటకు పంపకుండనే రక్తములో కలియునట్లుచేయును గావున వీనికి అంతస్స్రావ గ్రంధులనియు పేరుగలదు. ఈ స్రావములు జీవ శరీరము నకు సంబంధించిన రాసాయనికమగు మార్పులను జేయుటలో మిక్కిలి శక్తిమంతమైనవి. ఈ మార్పుల ననుసరించి శరీర నిర్మాణము మొదలయిన విషయములలో అనేక విధములైన వ్యత్యాసములు కలుగును. ఈ అంతస్స్రావ గ్రంధులయొక్క ప్రత్యేక వ్యాపారములు

చాలమట్టుకు తెలిసినను ఇవన్నియు కలిసి మొత్తము మీద శరీరములో ఏ విధమైన ప్రభావమును చూపించుచున్నవో, ఆ విషయమై ఇంకను శాస్త్రజ్ఞులకు పూర్తిగా తెలియలేదు. ఈ మధ్య వ్యాధి చికిత్సలో అద్భుత ఫలితములను కలిగించిన ఔషధములు చాలమట్టుకు ఈ అంతస్స్రావ గ్రంథులకు సంబంధించినవే. ఈ గ్రంధులలో పుట్టెడి శక్తిమంతమైన పదార్థములకే హార్మోనులని పేరు.

ఈ అంతస్స్రావ గ్రంధులలో పిట్యూటరీ గ్రంధి లేక పోషణక గ్రంధి యనునది తలపుర్రెలో కలదు. ఈ గ్రంధియొక్క నిర్మాణము చిత్రమైనది. దానికి ముందుభాగములో స్రావము గలిగించు భాగమును, వెనుకను కొన్నినాడులను, ఈ రెండింటిని కలిపెడి మధ్యభాగమును కలవు. ముందునుండు గ్రంధిభాగములో అనేకరకములైన కణము లున్నవి. వానికి అనేక వ్యాపారములు, శక్తులుకలవు. సంగ్రహముగా చెప్పవలసి వచ్చినచో మన శరీరపు పెరుగుదలకు తోడ్పడుట స్త్రీల గర్భాశయమునకు గ్రుడ్లనుండు ఫలకోశములను పురుషుల అండములను వ్యాపారములలో అభివృద్ధిచేయుట, స్త్రీలకు స్తన్యమును పుట్టించుట, గ్రైవేయక (థైరాయిడ్) గ్రంధియొక్కయు *అధివృక్క (ఎడ్రినల్) గ్రంధులయొక్కయు వ్యాపారములను నియమించుట ఈ పోషణక (పిట్యూటరీ) గ్రంధియొక్క ప్రధానమైన వ్యాపారములు.

ఈ పోషణక (పిట్యూటరీ) గ్రంధి యొక్క ముందుభాగములో పుట్టెడి ఏ. సి. టి. హెచ్. అను సంగ్రహ నామముగల ఒక హార్మోను (దీని పూర్తిపేరు ఎడ్రినో కోర్టికో ట్రోఫిక్ హార్మోను) ముఖ్యముగా

* అధి వృక్కగ్రంధులనగా వృక్కముల మీద అనగా మూత్ర పిండముల మీద నుండు గ్రంధులు.

గ్రైవేయక (థైరాయిడ్) అధివృక్క గ్రంధుల వ్యాపారములను నియమించు చుండును. ఇక పోషణక గ్రంధిలో వెనుకటి భాగము రెండు హార్మోనులను ఉత్పత్తి జేయును.

వీనిలో నొకటి ప్రేవులు మున్నగు వానికి సంబంధించి యుండు పేశాలను ముడుచుకొనునట్లు చేయగలదు. రెండవ హార్మోను గర్భాశయమునకు సంబంధించిన పేశాలను యుక్తసమయమున అనగా ప్రసవకాలములో ముడుచు కొనునట్లు చేసి శిశువు గర్భాశయమునుండి బయటకు వచ్చుటకు అనుకూలముగా పనిచేయును. ఈ పోషణక గ్రంధి, గ్రైవేయక గ్రంధి మొదలయిన ఇతర గ్రంధుల మీద తన ప్రభావమును జూపించును కాబట్టి దీనికి అంతస్స్రావగ్రంధుల అధినేతయని చెప్ప వచ్చును.

ఈ పోషణక గ్రంధిలో గడ్డ లేక కంతి పుట్టవచ్చును. అట్టి సమయములో ఈ గ్రంధిలో స్రావమెక్కువయి ఇతర హార్మోనుల ప్రభావముచే, శరీరావయవములు పరస్పర సంబంధ రహితముగా, వికారముగా పెరుగుచుండును. అనగా కాలుసేతులు, మొండెము మొదలయినవి అతిగాపెరిగి, శిరస్సు, ముఖము, మిగిలిన అవయవములు ఆ ప్రమాణములో పెరుగక చిన్నవిగానే ఉండుట తటస్థించును. దీనికి ఒక విధమైన రాక్షసాంగత్వము లేదా ఏక్రోమెగాలీ యనిపేరు. కొన్ని కారణములచే ఈ పిట్యూటరీ గ్రంధిలో కొంతభాగము పూర్తిగా పాడయినచో ఆ గ్రంధి వ్యాపారము క్షీణించి పోయి అనేక విధములైన వ్యాధిలక్షణములు కలుగును.

అంతస్స్రావ గ్రంధులలో నొకటియగు గ్రైవేయక గ్రంధి (థైరాయిడ్ గ్రంధి) యనునది మెడయందు ముందు భాగములో కలదు. ఈ గ్రంధి రక్తములో కొన్ని నిరింద్రియమైన అయోడిన్

మొదలయిన పదార్థములను గ్రహించి ఒక హార్మోనును ఉత్పత్తి చేయును. అందుచే మనము తిను ఆహారములోనున్న అయోడిన్ అను ద్రవ్యమునకును ఈ గ్రైవేయక గ్రంధికి సంబంధించిన వ్యాధులకును చాలమట్టుకు పరస్పర సంబంధము కలదు.

మెడలోనున్న ఈ గ్రైవేయక గ్రంధి పెద్దదయినచో ఆ వ్యాధికి 'గాయిటర్' అని పేరు. ఆహారములోను, త్రాగెడి నీటిలోను అయోడిను తక్కువగా నుండునట్టి ప్రాంతపు జనులలోనే ఈ వ్యాధి తరుచుగా కానవచ్చుచున్నది. కొంతమందికి ఈ గ్రైవేయక గ్రంధి యొక్క వాపుతో పాటు కొన్ని తీవ్రమైన లక్షణములు కూడ ఉండును. దీనినే మహాగ్రైవేయక వ్యాధి (Hyper-thyroidism) అని చెప్పవచ్చును. దీనిలో నేత్రములు గుడ్లగూబల కండ్లవలె పైకి ఉబికి యుండి, గుండెదడ, చెమటలు పట్టుచుండుట, వణుకు, చిన్నశబ్దములను విన్నను అమిత భయము, తరుచు విరేచనములు వెళ్ళుచుండుట మొదలయినవి కలుగును. స్త్రీలకు ఈ వ్యాధి కలిగినచో వారు ఆహారము మామూలుగా తినుచున్నను చిక్కిపోవుచుందురు. ఇందులో కనపడు లక్షణముల ఆధిక్యతబట్టి ఈ వ్యాధిని ప్రారంభములో కొంతమంది గుర్తింప లేకపోవుదురు. ఈ వ్యాధికి కొన్ని క్రొత్త ఔషధములు వచ్చినవి. రేడియో ఏక్టివ్ అయోడిన్ అను ఔషధము ఈ వ్యాధి యొక్క నిదానములోను చికిత్సలోను విశేషముగా ఉపయోగించుచున్నది. కాని సాధారణముగా ఔషధములు ఇచ్చిన మాత్రమున ఉపయోగ మంతగా లేక పోవుటచే ఈ వ్యాధిలో, గ్రైవేయక గ్రంధిలో కొంత భాగమునకు తగు శస్త్రచికిత్సను కూడ చేయవలసి యుండును.

క్షీణగ్రైవేయకము (Hypothyroidism) అను ఇంకొకవ్యాధి యున్నది. దానిలో ఈ గ్రైవేయక (థైరాయిడ్) గ్రంధియొక్క

స్రావము క్షీణించును. అనగా బాగా తగ్గిపోవును. శరీరములో నిర్మాణము మొదలయిన వ్యాపారములకు ఈ గ్రైవేయకగ్రంథి స్రావములకు విశేషమైన సంబంధముండుటచే ఈ క్షీణగ్రైవేయక మను వ్యాధి కలవారికి ఒక విధముగా శరీరము లావెక్కుట, కాళ్ళు చేతులలో సొట్టపడని వాపు. చర్మము బాగుగా అర్చుకొని పోవుట, విశేషమైన మాంద్యము, జడత్వము, మాట ముద్దగాను, అతి నెమ్మదిగాను, అస్పష్టముగాను, మింగినట్లుగాను వచ్చుచుండుట, ముఖముయొక్క వైఖరి అతి మందముగాను, ఏమియు చురుకులేక ఉండుట, మొదలగునవి కలుగును. ఇట్టి లక్షణములచే ఈ వ్యాధిని సుళువుగా గుర్తించ వచ్చును.

చిన్న శిశువులకుకూడ క్షీణ గ్రైవేయకమను వ్యాధి కలుగ వచ్చును. దానికి 'క్రెటినిజం' అనిపేరు. అట్టి పిల్లలను 'క్రెటిను'అని పిలుతురు. ఈక్షీణ గ్రైవేయకము కలవారికి గ్రైవేయక గ్రంధియొక్క సారమును (త్రైరాయిడు గ్రంధి ఎక్స్టాక్టును) యుక్తమైన మోతాదులో తగు జాగ్రత్తలతో నడిపించినచో చాల ఆశ్చర్యకరమైన గుణములు కనబడును.

స్థౌల్యమను రోగములోకూడ ఈ గ్రైవేయక గ్రంధియొక్క సారమును డాక్టరులు వాడుదురు గాని ఆ వ్యాదిలో ఈ గ్రైవేయక గ్రంధి యొక్క క్షీణతను, అల్ప క్రియత్వమును గుర్తించకుండగా, అనగా ఆ గ్రంధి క్షీణత లేనప్పుడు, దీనిని వాడుట మంచిది కాదు.

అంతస్స్రావ గ్రంధులలో ఇంకొకటియగు అధివృక్కగ్రంధి శరీరములో మూత్రపిండములమీద నున్నది. ఈ విధముగా రెండు అధి వృక్క గ్రంధులు కలవు. ఈ గ్రంధికి పైన బెరడువలెనుండు వల్కల భాగమును, లోపున దవ్వవంటి మజ్జాభాగమును గలవు. ఈ మజ్జా

భాగము అధివృక్క స్రావమును అనగా ఎడ్రినల్ అను స్రావమును పుట్టించును. ఈ ఎడ్రినల్ స్రావము శరీరములో ఆహారములోని పిండి పదార్థముల వినియోగములోను, హృదయముయొక్క వ్యాపారములోను, రక్తపుపోటుకు సంబంధించిన క్రియలలోను, శ్వాసకోశములయొక్క సంకోచ వ్యాకోచములలోను, ఇంకను ఇట్టి వ్యాపారము లనేకములలో తన ప్రభావమును విశేషము చూపించుచున్నది. ఒక మానవునకు ఒకానొక సన్నివేశములో కలిగెడి పిరికితనముచే పారిపోవుటయో, లేదా పరిస్థితులకు లొంగిపోవుటయో, లేదా ధైర్యముచే పరిస్థితులతో పోరాడుటయో, చాలమట్టుకు ఈ గ్రంథియొక్క స్రావముచే నియమింపబడును. ఈ అధివృక్క గ్రంథి మీద గడ్డవేసినచో రక్తపుపోటు మొదలయిన లక్షణములు అప్పుడప్పుడుగాని శాశ్వతముగా గాని కలుగవచ్చును.

ఈ అధివృక్క గ్రంథులయొక్క వల్కలమునకు (Cortex) అనేక విధములైన వ్యాపారములు కలవు. ఇది ఆహారములోని పిండి పదార్థముల మాంసకృత్తుల వినియోగము సరిగా జరుగునట్లుచేయుట, శరీరములోనున్న నీటిని ధాతు కణములలోనుండు విద్యుత్పరివర్తిత ములను దానిని సరియైన సంబంధములో నుంచుట, జననావయవ గ్రంథుల వ్యాపారములను నియమించుట మొదలయిన పనులను జేయును. ఈ సూక్ష్మ వ్యాపారములన్నియు, ఈ మధ్యనే శాస్త్రజ్ఞులచే కనుగొనబడి లోకమునకు వెల్లడి అయినవి. ఈ అధివృక్క గ్రంది యొక్క వల్కలమునుండివచ్చు స్టెరాయిడ్లను ద్రవ్యములను ఈ మధ్యనే రాసాయనికముగా కృత్రిమముగా తయారుజేసి వ్యాధుల చికిత్సలో ఉపయోగించుచున్నారు. వానిలో నుండియే 'కార్టిసోన్' సుప్రసిద్ధమైన ఔషధ ద్రవ్యము వచ్చినది. పోషణక గ్రంథి (పిట్యూటరీ) కూడ ఏ. సి. టి. హెచ్. అను సంగ్రహ నామముగల ఎడ్రినో కార్టికో

ట్రోఫిక్ హార్మోను అను వొషక ద్రవ్యమును ఉత్పత్తి జేయుచున్నది. మనకు కార్టిసోను అను ద్రవ్యము రాసాయనికముగా కృత్రిమముగా సిద్ధించినది కాని ఈ ఎ. సి. టి. హెచ్. అనెడి ద్రవ్యము ఇంకను రాసాయనికముగా కృత్రిమముగా ప్రయోగశాలలో (Laboratory) లభ్యముకాలేదు, దీనిని పందుల శరీరములోనుండు పిట్యూటరీ గ్రంధుల ద్వారా మాత్రమే తీయగలుగుచున్నారు. ఈ ఎ. సి. టి. హెచ్. అను ద్రవ్యమును, కార్టిసోను అను ద్రవ్యమును అనేక వ్యాధుల చికిత్సలో అత్యద్భుత గుణములను కనబర్చినది; కొంతమందిని ప్రాణాపాయము నుండి తప్పించినది; కాని వీని ఉపయోగమువల్ల కొన్ని దుర్గుణములు కూడ కలుగవచ్చును గావున వానిని అత్యవసరమైనప్పుడు మాత్రమే జాగ్రత్తగా కూడ వాడవలయును.

ఉపగ్రైవేయక గ్రంధులని (పారాథైరాయిడ్ గ్రంధులు) మెడకు రెండు ప్రక్కల రెండేసి చొప్పున కలవు. ఇవి శరీరములో కాల్షియం (సున్నము) వినియోగ విషయమై ఉపకరించుచుండును. కావున ఎముకల నిర్మాణ విషయమై పోషణ విషయమై ఉపయోగించ గలవు. ఈ ఉపగ్రైవేయక గ్రంధులు మామూలు కంటె ఎక్కువ పనిచేసి, వానిలో గడ్డ లేక కంతి కట్టకపోయినను సరే, తమ స్రావము లను ఎక్కువగా ఊరించినచో వానివలన శరీరములో అనేక విధములైన వ్యాధి లక్షణములు కలుగును. కాని ఈ వ్యాధి లక్షణములు విశేషముగా ఒక్కొక్కప్పుడు అనేక విధములుగా కనపడుటచే ఆ లక్షణములను బట్టి ఈ వ్యాధిని కనుగొనుట చాలకష్టము.

జననావయవ గ్రంధులు:— స్త్రీలలో గర్భాశయమునకు రెండు ప్రక్కలనుండు ఫలకోశములు (Ovaries) అప్పుడప్పుడు సూక్ష్మము లైన గుడ్లను (Ova) తయారు జేయుచు వానిని ఋతురక్తము ద్వారా

బయటకు పంపును; పురుషుని అండములో శుక్రబీజములు పుట్టును. గర్భోత్పత్తికి ఈ రెండును అవసరమురే. కాని, ఇచ్చట అంతర గ్రంధి స్రావవ్యాధి ప్రసక్తిలో వీనిలో మనకు పనిలేదు. ఈ జననావయవ గ్రంధులు కూడ కొన్ని కొన్ని స్రావములను తయారుచేయుచు, స్త్రీశరీరములో కొన్ని పురుష లక్షణములను, పురుషుని శరీరములో కొన్ని స్త్రీ లక్షణములను కొంతవరకు పుట్టించుచున్నవి. అయితే ఈ జననావయవ గ్రంధి స్రావముల మీద కూడ పోషణక గ్రంధి యొక్కయు, అధివృక్క గ్రంధి యొక్కయు, ప్రభావము అధికముగా నున్నవి. యౌవన దశలోను, తత్పూర్వమును, ఈ గ్రంథులను శస్త్రము ద్వారా తీసి వేసినచో ఆ యా స్త్రీత్వ పురుషత్వ లక్షణములు చాలమట్టుకు మరుగు పడిపోయినవి. కాని వార్ధక్య దశలో ఈ గ్రంధులను ఛేదించి తీసివేసినను ఈ స్త్రీత్వపురుషత్వ సంబంధమైన మార్పులు ఏమియు కనబడలేదు,

ఈ విషయములో చెప్పవలసిన దేమనగా, ప్రతిపురుషునిలోను స్త్రీలక్షణములను కలుగజేయు గ్రంథులు కొన్నియును, ప్రతిస్త్రీలోను పురుషలక్షణములను కలుగజేయు గ్రంథులు కొన్నియు సూక్ష్మముగా కొంతవరకు ఉన్నవి. కొంతమందికి అప్పుడప్పుడు ఈ సూక్ష్మముగా నుండు ఈ వ్యతిరేక లక్షణములే హెచ్చయి, శారీరకమైన మానసికమైన కొన్నిగుణములను బాధలను, కలుగ చేయవచ్చును.

# 4 జీర్ణకోశ వ్యాధులు

రోగులు మామూలుగా 'అజీర్ణము చేసినది' అని మాత్రము చెప్పుటచే డాక్టరుకు అంత మాత్రమున ఆ వ్యాధి అర్థమైనదని అనుకొనకూడదు. ఎందుచేననగా ఈ అజీర్ణముచేసినదనుమాట అనేక వ్యాధులతో చేరియుండు సామాన్యమైన మాటమాత్రమే. వైద్యుడు అంత మాత్రముచే సంతృప్తిపడక శరీరమును జాగ్రత్తగా పరీక్ష జేయుచు, పూర్వ చరిత్రను అడిగి, అవసరమైనచో శాస్త్ర ప్రయోగశాలలో (Laboratory) కొన్ని పరీక్షలను చేయించవచ్చును. మామూలుగా ఆహారమును ఉపయోగించుటలో ఏదో అపకతవకవలన కలిగెడి స్వల్పమైన అజీర్ణమును రోగులు ఉపేక్షజేసినను చేయవచ్చును గాని, తీవ్రముగాను తరుచుగాను వచ్చెడి అజీర్ణముతో కూడిన కడుపునొప్పి, శూల, వాంతి మొదలయిన లక్షణములను, ఏదో అజీర్ణము అని సరియైన డాక్టరుకు చూపించకుండగా ఎంతమాత్రము ఉపేక్ష జేయరాదు. ఈ కడుపు నొప్పి అను లక్షణమునకు అనేకకారణములున్నవి. వానిలో

కడుపులోపుండు లేదా ఆమ్ల-రణు ప్రణమనునది ఒకటి. ఇందులో తీవ్రముగా కడుపునొప్పి వచ్చును. ఈ వ్యాధిలో పుండు సాధారణముగా జీర్ణకోశము లేక ఆమాశయములోగాని అమాశయము తరువాతనుండు గ్రహణియనుపేరు క్షుద్రాంత్రముయొక్క పై భాగములోగాని ఉండును. ఈ వ్రణములేక పుండు ఉన్నస్థానమునుబట్టి ఈ వ్యాధిని ఆమాశయవ్రణము **(Peptic Ulcer)**, లేదా గ్రహణీవ్రణము **(Duodenal Ulcer)** అని చెప్ప వచ్చును.

ఈ వ్యాధి ప్రత్యేకముగా కొన్ని కుటుంబములలో అనేకులకు కనబడుచున్నది. వానిలో పురుషులలో సామాన్యముగా గ్రహణీవ్రణము కలుగుచుండును. ఈ వ్యాధి నిర్ణీతముగా కొన్నికుటుంబములలో మాత్రమే కనబడుటకు హేతువులేవో స్పష్టముగా తెలియలేదు. బహుశా ఆహారపోషణచే కలిగెడి మార్పులచే ఆమాశయముయొక్క ఆమత్వచ **(Mucus Membrane)**లో వ్యాధి కలుగుటచేగాని ఆమాశయము మొదలయిన భాగములకు రక్తమును సరఫరాజేయు అంగములలో మార్పు కలుగుటగాని ముఖ్యకారణమై యుండవచ్చును. కొంతమందికి ఆమాశయములో అప్పుడప్పుడు పుట్టెడి చిన్న చిన్న వ్రణములు త్వరగా మాని పోవచ్చును. ఆమాశయములో పెద్దవ్రణము పుట్టినప్పుడు అది త్వరగా మానదు. ఈ విధముగా త్వరగా ఆమాశయములో వ్రణము మానకపోవుటకు ఆమాశయములో హైడ్రోక్లోరికామ్లము హెచ్చుగాగల జాఠర రసము ఊరుచుండుటకారణము. పదియవ శీర్షనాడి (దీనిని ప్రాణద అను నాడీయని కూడ అందురు **Vagus**) ద్వారా ఆమాశయమునకు వచ్చెడి నాడీవేగములచే ఆమాశయమునందు జాఠరరసము ఊరుచుండును. కొంతమందిలో స్వాభావికముగానే ఈ ప్రాణదయను నాడి విశేషముగా పనిచేయుటచే

జాఠరరసము అధికముగా ఊరుచుండును. మరియు కోపము, విచారము మొదలయిన మానసిక వికారములు కలిగినప్పుడు ప్రాణద యనెడి శీర్షనాడి చేయు పనివలన జాఠరరసములో ఆమ్లము విశేషముగా ఊరుచుండును. సాధారణముగా మానసికమైన వికారములు ఈ వ్యాధికి కారణమగుటచే, ఈ వ్యాధి ప్రధానముగా మనోవికారముచే జనించు వ్యాధియని చెప్పుచున్నారు. ఈ మధ్య జరిగిన 2 వ ప్రపంచ యుద్ధములో జర్మను విమానములు రాత్రిసమయములలో ఇంగ్లాండులో ఇళ్ళమీద దాడిచేసినపుడు ఈ వ్యాధి తరుచుగా ఇంగ్లండు దేశస్థులలో కనబడినది. మానసిక కారణములే గాక చుట్టలు వగైరాలు ఎక్కువగా కాల్చుట, కాఫీ మొదలయిన వానిని హెచ్చుగా త్రాగుట, సారాయి మొదలయిన దురలవాట్లు కూడ ఈ వ్యాధికి ముఖ్యకారణములు.

ఈ వ్యాధి ఉన్నవారికి ఒక్కొక్కప్పుడు కొన్ని ప్రమాదములు హఠాత్తుగా కలుగవచ్చును. కడుపులో నున్న పుండునుండి రక్తము స్రవించి రక్తమే వాంతియగుట, కడుపులోని పుండు లోపలకు వ్యాపించి, లేదా చిట్లిపోయి, ఆ అవయవ భాగములో చిల్లుపడుట, ఆ పుండుగల భాగము వాచి ఆహారము లోపలికివెళ్ళుటకు అడ్డుకలుగుట మొదలయినవి ఈ వ్యాధికలవారికి కలుగుముఖ్యమైన ఉపద్రవములు. ఒక్కొక్కప్పుడు ఆమాశయములో వ్రణము పుట్టకురుపుగా మార వచ్చును. గ్రహణీవ్రణమునుండి రక్తము స్రవించినప్పుడు తలదిమ్ము, తలతిరుగుట, నీరసము మొదలయిన లక్షణములు కలిగి, ఆ రక్తము ఆ ప్రేవుల రసములతో కలిసి తారువలె నల్లగా అయి గుదమార్గము ద్వారా పోవచ్చును. గ్రహణి యందు పుండునుండి వచ్చు రక్తము ఆమాశయము లోనికి రాకపోవుటచే ఈ గ్రహణీవ్రణములో రక్తవమనము కాదు. ముఖ్యముగా ఇచ్చట చెప్పవలసిన విషయమేమనగా

హఠాత్తుగా తల తిరుగుట, విశేషముగా నీరసము, తారువంటి నల్లని రక్త విరేచనములు, ఏరోగికి కలిగినను, వానిని ఎంతమాత్రము ఉపేక్షజేయరాదు. వీరికి సాధారణముగా ఆమాశయ వ్రణమో, గ్రహణీ వ్రణమో ఉండును.

ఆమాశయములోగాని గ్రహణిలో గాని ఈ పుండే చిట్లి అచ్చట చిల్లుపడినప్పుడు, అనగా అచటనుండు పొరలు తెగినప్పుడు (Perforation) రక్తము మొదలయినవి ఇతర అంతర్భాగములలో ప్రవేశించును. దానివలన విపరీతమైన నొప్పి, ఉదరమంతయు బిగుసుకొని పోవుట, విశేషము నీరసము, శరీరము చల్లబడి పోవుట మొదలయిన లక్షణములు కలుగును. ఆమాశయభాగము లేదా గ్రహణి భాగము ఈ విధముగా చిల్లు పడుటను పైగుణములచే కనిపెట్టి వెంటనే అవసరమైతే శస్త్రచికిత్సకూడ చేయవలసి యున్నది.

ఇట్టి వ్రణములు మొదలయిన వానిచే ఆహార నాళములో అవరోధము కలిగినప్పుడు, అంతకు ముందు తినిన ఆహారము దుర్వాసనతో కూడి వాంతులుగా పోవనారంభించును. ఆహారము కొంతకాలము కడుపులో అట్లు నిలవయుండుటచేతను, దానిలో కొన్ని జాఠరరసములు కలియుట చేతను దానికి దుర్వాసన కలుగును. అప్పుడు ఆమాశయ భాగమును జాగ్రత్తగా శస్త్రముచేసి పుండు మొదలయిన వానిని తీసివేసి యుక్తముగా ఆహారనాళ రంధ్రము సరిగా నుండునట్లు కుట్టి భద్రము చేయవలసియుండును.

ఆమాశయములో వ్రణమునకు ప్రారంభములో శస్త్రచికిత్స అవసరములేదు. కాని, జాగ్రత్తగా ఔషధములను తినుచు పథ్యము చేయవలసి యుండును, పేకవట్టున ఆహారమును భుజించుట, జీర్ణము

చేసెడి ఆమాశయమునకు ప్రశాంతి నిచ్చుట, అందులో ఉత్పత్తి పాచక రసములోని ఆమ్లమును తగ్గించుట. వీనిచే చాల మట్టుకు గుణములు కనబడగలవు. ఈ వ్యాధి కేవలము ఆహారమువలన మాత్రమే గాక, మానసిక వికారములచే కూడ కలుగుటచే, రోగి తాను భుజించు ఆహారము యొక్క మంచిచెడ్డలు, వాని వేళలు, వాని మధ్య వ్యవధి మొదలయిన విషయములేగాక, మానసిక నియమములను గూడ జాగ్రత్తగా పాటించు చుండవలెను.

## మ ల బ ద్ధ ము :

శరీరములో పెద్ద ప్రేగుయొక్క ప్రారంభములో చిన్న తోక వంటి అవయవము కలదు. దానికి ఉండుక పుచ్ఛము (Appendix) అనిపేరు. దీనిలో వాపుకలిగినప్పుడు హఠాత్తుగా హెచ్చుశూల కలుగును. ఒకప్పుడు ఈ శూల ప్రేవులలో మలము నిలవఉండుటచేత, విరేచనము ప్రతిరోజు అగుచున్నను అది పూర్తిగా విసర్జన కాకపోవుటచేతను కూడ కలుగవచ్చును. పెద్ద ప్రేవులకు సంబంధించిన ఇట్టి యాంత్రిక మైన (mechanical) బాధవలనకూడ చిరకాలమునుండి మలబద్ధము అందువలన కడుపునొప్పి కలుగవచ్చును. అందుచే ఏ కడుపునొప్పి లేక శూల వచ్చినను దానికి రోగి ఏదో తన ఊహతో విరేచనాల మాత్రవేసికొనుట మొదలయిన పనులను చేయకూడదు. ఇట్టి శూలలలో వెంటనే డాక్టరును సలహా చేయ వలయును.

సాధారణముగా అనేకులు ఈ విరేచనముల మాత్రలను బిళ్ళలను ఎవరితోనుగూడ చెప్పకుండగా వేసికొనుచుందురు. ఇది ఎంతమాత్రము మంచిదికాదను విషయమును నొక్కి చెప్పుచున్నాను. మలబద్ధము సాధారణముగా సామాన్యమైన కారణములచే కలిగి అంత బాధించునది

కాకపోయినను, ఒకప్పుడు ప్రేవులలో ఒక్కొక్క వ్యాధిమొదలుటచేకూడ కలుగుచుండును. అప్పుడు ఆ వ్యాధికి, దాని కారణమునుబట్టి తగిన ఔషధము నిచ్చుటయేగాక,మలబద్ధమును పోగొట్టుటకు ఒకప్పుడు శస్త్ర చికిత్సకూడ అవసరమగుచుండును. మామూలుగా మలబద్ధము మనుజుని ఆహారము, అలవాట్లు మొదలగు వానిని బట్టి సంభవించుచుండును. విరివిగా ఆకుకూరలు, కాయగూరలు, ఫలములు, మొదలయిన వానిని తినుచుండినచో పురీషములో కావలసిన స్థూలపదార్థములు( roughage) ఏర్పడి మలవిసర్జన ప్రతిరోజు సరిగా జరిగిపోవుచుండును. మల విసర్జన ప్రతిరోజును సకాలములో అగుటకు, ఆ వేళలలో పెద్ద ప్రేగు లలో వేగము కలుగుట, దానిచే విరేచనమునకు అనుమానము కలుగుట అనునవి ఆ ప్రేవులకు సంబంధించిన నాడులలో జరిగెడి కార్య విశేషములు. ఉదయమున లేవగానే మరుగుదొడ్డికివెళ్లెడి అభ్యాసమును చిన్నతనమునుండి అలవర్చుకొనినచో, ఆ అభ్యాసము పెద్దవారలయి నప్పుడుకూడ అట్లే నిలిచిపోయి, మలబద్ధమను వ్యాధియే రాదు. అప్పు డప్పుడు విరేచనముల మందును పుచ్చుకొనుట, వస్తికర్మ (ఎనీమా) లను తరుచు తీసికొనుట, మున్నగు వానికంటె పైజెప్పిన అభ్యాసమును జేసికొనుటయే మంచిదని అందరును గుర్తించవలసి యున్నది.

## కడుపులో దుర్మాంసపు బల్ల పెరుగుట :

ఈ దుర్మాంసపు బల్ల (Cirrhosis of Liver) ఉదరములో కుడి ప్రక్కనుండు కాలేయము (యకృత్తు) లో పుట్టును. మద్యము లేక సారాయి త్రాగుటచే ఇది కలుగునని పూర్వము తలంచుచుండెడి వారు. కాని ఇది శరీరపోషణకు సంబంధించిన వ్యాధి, అనగా ఒక విధమైన ఆహారలోపముచే కలుగు వ్యాధియని ఈ మధ్య నిర్ణయించ

బడినది. మేదోజీర్ణకారులని (lipotropic) అనబడెడి కొన్ని ఎమీనామ్లములు ఆహారములో ముఖ్యముగాలోపించుటచే, ఆహారములోని క్రొవ్వు పదార్థములు కాలేయములోని మూలకణములలో ఎక్కువగా జేరి అవి కొన్నాళ్ళకు నశించిపోయి దుర్మాంసము తయారు అగుటచే ఈ వ్యాధి సంభవించును. కాలేయము శరీరపోషణకు ముఖ్యమైన అవయవమగుటచే, అది జబ్బుపడుట వలన శరీరమునకు అపకారులగు విషపదార్థములను కాలేయము నశింపజేయలేక పోవుట, శరీర పోషణ పాడగుట సంభవించును. కాలేయములోని చిన్న చిన్న పైత్యనాళము లును రక్తనాళములును ఈ క్రొత్తగా పుట్టిన దుర్మాంసపు తంతువులలో ఇరుకుకొనిపోయి, వాని పనులు క్రమముగా స్తంభించి పోవును. కాలేయ ములో దుర్మాంసము కల రోగికి అన్నహితవు లేకపోవుట, కడుపులో గుడగుడలు మొదలయిన అస్పష్టమైన అజీర్ణలక్షణములు ఈ వ్యాధి ప్రారంభములో కలుగును. రాను రాను అతనికి రక్తము వాంతి యగుట, రక్తము గుదమునుండి పోవుట, ఉదరములో నీరు పుట్టుట అనగా జలోదరము కలుగుట మొదలయినవి సంభవించును. ఈ వ్యాధిని ప్రారంభములో గుర్తించుట ఎంతకష్టమో బాగుగా ముదిరిన తరువాత కుదుర్చుట కూడ అంత కష్టము.

## కామల లేక కామెర్లు :

కంటిలో తెల్లగుడ్డులోను, ఒక్కొక్కప్పుడు చర్మమంతయును కనపడెడి పసుపు పచ్చదనమే కామిలావ్యాధి. ఇందులో మూత్రము ఎక్కువ పసుపుగాను లేదా ఎర్రగాను ఉండును. ఆ మూత్రములో పసరుకణములు, పైత్యపు లవణములు, ఎక్కువగా పోవుచుండును. రక్తములో ఈ పసరు కణములు, పైత్యపులవణములు ఎక్కువగా జేరుట వలన అవి మూత్రములోనికి దిగి పై విధముగా పోవుచుండును.

పసుపు పచ్చ రంగు రక్తములోని ఎఱ్ఱకణములు నాశనమగుట వలన కలుగుచున్నది. ఈ రంగును కాలేయములోని కణములు గ్రహించి ఈ వ్యాధిలక్షణములను కలుగజేయును. అందుచేత రక్తప్రసారములో ఈ రంగు ఉండుటకు ఈ క్రింద చెప్పబడిన మూడుకారణములలో ఏదియో ఒకటి ఉండవలెను.

1. కొన్ని కారణములచే రక్తములోని ఎఱ్ఱకణములు మిక్కిలిఎక్కువగా నాశనమగుట.

2. కాలేయములోని కణములు రక్తకణముల రంగును ఉపయోగము లోనికి తీసికొని రాలేకపోవుట.

3. కాలేయములోని పైత్యము, రంగు, కొన్ని పైత్యనాళముల ద్వారా ప్రేవులలోనికి ప్రవించుచుండును. అట్టి పైత్యనాళములకు అడ్డు కలుగుట—

ఇట్టి భిన్నకారణముల వలన కామెర్లు అను వ్యాధి పుట్టుటచే ఇది ప్రత్యేకమైన ఒక వ్యాధి కాదనియు, ఏదో ఇంకొక వ్యాధియొక్క లక్షణము మాత్రమేననియు తెలుసుకొనవలెను. అందుచే, కామెర్లు అను లక్షణముగల అసలువ్యాధిని డాక్టరుచే జాగ్రత్తగా పరీక్షజేయించు కొని,దానినిబట్టి చికిత్స జరుగవలయును. ఒక్కొక్క కామెర్ల వ్యాధిలో కాలేయములోని పైత్యనాళములో అవరోధము (అడ్డు) సంభవించి నపుడు దానిని సరిదిద్దుటకు అవసరమైన శస్త్రచికిత్సను కూడ చేయవలసి వచ్చును.

సాధారణముగా సంభవించు కామలావ్యాధులలో కొన్ని అత్యంత సూక్ష్మజీవుల సంపర్కముచే కాలేయము వాచుట సంభవించును. (infective hepatitis). వైరసులనబడెడి ఈ అత్యంత సూక్ష్మ

జీవులు సూక్ష్మదర్శినీ యంత్రములో కూడ కానరావని వెనుక జెప్పి యున్నాను. ఈ అత్యంత సూక్ష్మజీవులు ప్రపంచమంతా వ్యాపించి యున్నవి- కొంతమంది పిన్నవయస్కులకు ఈ సూక్ష్మజీవుల వలన ఈరకపు కామలా వ్యాధి కలుగు చున్నది. టైఫాయిడ్ జ్వరము. జిగట విరేచనములు, మొదలయిన వ్యాధులను కలుగజేయు సూక్ష్మజీవుల వలెనే ఈసూక్ష్మజీవుల వలన గూడ ఈవ్యాధి తినెడి ఆహారము ద్వారాను, త్రాగెడి నీటి ద్వారాను, వ్యాపించుచున్నది. ఈవ్యాధి వివరములను సాంక్రామిక వ్యాధులు లేక అంటువ్యాధులు అను ఇంకొక గ్రంథములో విస్తృతముగా చర్చింప దలచితిమి.

# 5 హృదయ వ్యాధులు

మనము అప్పుడప్పుడు వార్తాపత్రికలో ఎవరికో ఒకరికి గుండె హఠాత్తుగా పనిచేయకుండా ఆగిపోయి, ఆయన మరణించినాడని చదువు చుందుము. శాస్త్రీయముగా ఆలోచించినచో, ఆ వ్యక్తి మరణమునకు కేవలము ఆతని హృదయము ఒక్కటి మాత్రము పనిచేయక ఆగి పోవుట కారణమనుట నిజముకాదు. మిగిలిన అవయవములన్నియు సరిగా పనిచేయుచు, ఒక్క హృదయము మాత్రము ఆగిపోయి ఆ వ్యక్తి మరణించినచో అట్లు చెప్పుట యుక్తముగా నుండును. ఏ కారణముచేత మరణము సంభవించినను అన్ని అవయవముల పనులు ఆగిపోవును కదా!

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా, వార్తా పత్రికలలో చెప్పినట్లుగా ఏ మనుజునకైనను అంతవరకు ఆరోగ్యముగానున్న హృదయము ఒక్కసారి చటాలున ఆగిపోదు. ఫలానావ్యక్తి పైకి ఆరోగ్యముగా కనబడుచు, ఏదో ఒకచోట మాట్లాడుచు, హఠాత్తుగా క్రిందపడి మరణించి

నాడని, అంటే, ఆమనుజునకు ఆతనికికూడ తెలియని హృద్వ్యాధిగాని మరియొకవ్యాధిగాని ఉంది యుండవచ్చును. హృదయము రక్తమును చిమ్మెడి పంపు వంటిది. అట్లు నిరంతరము అది రక్తమును చిమ్ము చున్నను దానిలోనుండు రక్తమును బట్టియే ఆ హృదయమునకు పోషణ జరుగదు. ఆ హృదయమును పోషించెడి రక్తము ఇంకొక చిన్న రక్తనాళము ద్వారా హృదయమునందలి పేశీ (కండ) లోనికి రావలయును. ఇట్లు హృదయమును పోషించెడి రక్తనాళమును 'హృత్పోషణి' (coronary artery) అని అందురు. ఈ హృత్పోషణి యను రక్తనాళములో అడ్డు కలిగినచో హృదయము పనిచేయక హఠాత్తుగా ఆగిపోవును.

అయితే కొంతమందికి ఈ హృత్పోషణి యను రక్తనాళములో అడ్డు కొంతవరకు మాత్రమే యుండును. అప్పుడు ఆ అడ్డును బట్టి, ఆ వ్యక్తికి హృదయములో కొంతభాగమే పనిచేయక పోవుటయు, ఆ రోగికి తీవ్రమైన గుండెపోటు మాత్రము కలుగుటయు సంభవించును. ఈ ప్రకారము రక్తనాళములో అడ్డుకూడ అంతకు పూర్వము ఏదో వ్యాధి యున్ననే తప్ప కలుగదు. అట్టి వ్యాధులలో ముఖ్యమైనది ధమనీ కాఠిన్యము (atherosclerosis) అనగా ధమనులు లేక రక్త నాళములు పెళుసెక్కి పోవుట. ఈ విషయమును ఇంకొకచోట వివరించెదము. ఈ ప్రకారముగా ధమనీకాఠిన్యముచే హృత్పోషణి అను ధమనిలో అడ్డుకలిగినపుడు రోగికి గుండెలో తీవ్రమైన శూలపుట్టి అది అన్ని వైపులకు వ్యాపించుచుండును. తీవ్రమైన బాధచే రోగికి కుదురు ఉండదు. చెమటలు ఎక్కువగా పట్టును. ఈ పరిస్థితులలో వెంటనే డాక్టరుకు కబురు చేయవలెను. డాక్టరు ఈ వ్యాధిని సులువుగానే గుర్తింపగలుగును. కొన్ని కేసులకు మాత్రము 'ఎలెక్ట్రోకార్డియో

గ్రాము' అను యంత్రముచే పరీక్ష చేయించవలెను. ఈ వ్యాధిలో వెంటనే సరియైన చికిత్స చేయించవలెను. అమెరికాలోను, ఐరోపా దేశములోను శాస్త్రాభివృద్ధిచే అంటువ్యాధులు చాలమట్టుకు అదుపులోనికి వచ్చినప్పటికిని ఈ హృత్పోషణి ధమనియందు కలిగెడి అడ్డుచే మరణములు ఇంకను హెచ్చుగానే కలుగుచున్నవి. భారత దేశములోకూడ ఈ వ్యాధివలన మరణములు హెచ్చుగానే ఉన్నవి.

మధుమేహము లేక మూత్రములో చక్కెర పోవుట అను వ్యాధి చిరకాలమునుంచి యున్నచో, దానికి సరియైన చికిత్స చేయక ఉపేక్షించినను కూడ ధమనీ కాఠిన్యము సంభవించునవెడి విషయము ఇంకొకచోట వివరించబడి యున్నది. ఈ హృత్పోషణి ధమనిలో అడ్డు కలుగుటకు (coronary thrombosis) రక్తపుపోటుకూడ ఇంకొక ముఖ్యకారణము.

# 6 హెచ్చు రక్తపు పోటు

సామాన్యముగా ప్రతి మనిషికి రక్తపుపోటు సిస్టాలిక్‌గా (పాదరసపు) 120 మిల్లీమీటరులును, డయస్టలిక్‌గా (పాదరసపు) 80 మిల్లీ మీటరులును ఉండును. ఈ విషయము డాక్టరు లందరు ఉపయోగించెడి రక్తపుపోటు యంత్రమువలన తెలియును. శరీరమునుండి, ఊపిరితిత్తులనుండి, హృదయము లోనికి రక్తము వచ్చుచు తిరిగి అది శరీరములోనికి, ఊపిరితిత్తులలోనికి చిమ్మబడుచు ఈ విధముగా హృదయము సంకోచము చెందునపుడు రక్తము రక్తనాళములలో కలుగజేయు ఒత్తిడిని సిస్టాలిక్ ఒత్తిడి అని, వ్యాకోచము చెందునపుడు కలుగజేయు ఒత్తిడిని డయాస్టలిక్ ఒత్తిడి అని చెప్పుదురు. ఆ ఒత్తిడిని కొలుచుటకు 'రక్తపుపోటు యంత్రము' ఉపయోగించుదురు. ఆ యంత్రములో పాదరసము యొక్క స్థితిని బట్టి, రక్తపుపోటు ఎన్ని మిల్లీమీటరులో తెలిసికొనవచ్చును. ప్రపంచములో ఏ ఇద్దరు మనుష్యులును సరిగా ఒకే విధముగా ఉండరు కదా. ఉదాహరణకు ప్రపంచములో

ఏ ఇద్దరి ముక్కులను కొలిచినను ఆ రెండింటికిని ఎంతో కొంత, స్వల్పముగానైనను, తేడా ఉండును. అదేవిధముగా రక్తపుపోటు కూడ అందరకును ఒక విధముగా నుండదు. సామాన్యముగా మనుష్యులకు 98.4 డిగ్రీల వేడిమి ఉన్నప్పుడు తీసిన రక్తపు పోటును సగటున ఇక్కడ సూచించితిమి. అది సిస్టాలిక్‌గా 120 మిల్లీమీటరులును, డయస్టలిక్‌గా 80 మిల్లీమీటరులును ఉండును. వయస్సు ముదిరిన కొలదిని ఈ హృదయ సంకోచపు రక్తపుపోటు అనగా సిస్టాలిక్ రక్తపుపోటు కొద్దిగా ఎక్కువగును. కాని వివిధ వ్యక్తులకు వారి వయస్సులను బట్టి రక్తపుపోటు ఒక నియమము ప్రకారము మారుచుండునను సిద్ధాంత మేదియునులేదు. ఈ విధముగా రక్తపుపోటు హెచ్చుటకు అనేక కారణములున్నవి. రక్తములోని మాలిన్యమును వడపోసి బహిష్కరించు మూత్రపిండములలో వ్యాధి యున్నప్పుడుకూడ రక్తపుపోటు హెచ్చగును. వెనుక మధుమేహము విషయమై చర్చించునపుడు చెప్పిన పోషణక గ్రంథి, గ్రైవేయకగ్రంథి, అధి వృక్క గ్రంథులు మొదలయిన వాని కన్నిటికి పరస్పర సంబంధము కలదు. కావున వానిలో దేనికైనను వ్యాధి కలిగినప్పుడు ఈ రక్తపుపోటు హెచ్చు కావచ్చును. కాని మామూలుగా ప్రమాదించెడిదని చెప్పబడెడి రక్తపుపోటు. అనగా ప్రధాన రక్తపుపోటు (essential hypertension) మూత్రపిండముల వ్యాధివలనగాని, అంతర్గ్రంథుల వ్యాధుల వలన గాని కలుగుటలేదు. పూర్వము చెప్పినట్లుగా ఒక్కొక్క మనిషికి అతని శరీర తత్వములోనే ఈ రక్తపుపోటు కలిగెడిరీతి ఇమిడి యుండునని తోచుచున్నది. అంతేగాని ఈ ప్రధానరక్తపు పోటుకు సరిగా ఏవికారణములో ఇంకను స్పష్టముగా తెలియలేదు. ఆధునిక యుగములో అతి మనోవ్యాకులత కలవారికి వారి స్వతంత్ర నాడీమండలము (sympathetic nervous

system) ఎక్కువగా పనిజేయుటచే, చిన్న చిన్న రక్తనాళములు పలుమారులు సంకోచము నొందుచున్నవి. అందువలన రక్తప్రసారము అడ్డులేకుండగా సరిగా జరుగుటకై ఈ రక్తపుపోటు విధిగా ఏర్పడు చున్నదనియు కొంతమంది శాస్త్రజ్ఞులు విశ్వసించుచున్నారు. రక్తపుపోటు విషయమై ఈ మధ్యన చేసిన పరిశోధనల వలన, రక్తపుపోటుకు, మనము తినెడి ఆహారమునకు పరస్పర సంబంధమున్నదనియు, హెచ్చు రక్తపుపోటునకు అధివృక్క గ్రంథియొక్క తలభాగమునకు పరస్పర సంబంధమున్న దనియు కొంతమంది విశ్వసించుచున్నారు.

సాధారణముగా రక్తపుపోటు అను వ్యాధి పాశ్చాత్య నాగరికత వలన మనకు సిద్ధించినదని అందరును అనుకొనుచున్నారు. కాని అది సరికాదని తోచుచున్నది. ఎందుచేననగా ఈ వ్యాధి పట్టణముల లోనేగాక పాశ్చాత్యనాగరికతా ప్రభావము లేని పల్లెలలో గూడ తరుచు కాన వచ్చుచున్నది. ఆహారములో ఉప్పు ఎక్కువ వేసికొనుటవలన రక్తపుపోటు ఎక్కువగుచున్నదని కొంతమంది అభిప్రాయమై యున్నవి. రక్తపుపోటుగల మనుజునకు ఒక్కొక్కనికి కేవలము తలనొప్పి, తల దిమ్ము మాత్రము అస్పష్టముగా కలిగి డాక్టరు దగ్గర సలహాతీసికొనుటకు వెళ్ళవచ్చును. కాని సాధారణముగా ఇట్టివారు వ్యాధి ముదిరిన తరువాత ప్రమాదకరమైనస్థితి వచ్చినపుడు మాత్రమే డాక్టరు సలహాను పొందుచున్నారు. హృత్పోషణిధమనిలో అవరోధము (coronary occlusion) అట్టి ఉపద్రవములలో నొకటియని ఇప్పుడే కదా చెప్పితిమి.

హార్దికశ్వాస లేక హృదయమునకు సంబంధించిన వగర్పు, (cardiac asthama) ముఖ్యముగా అర్ధరాత్రులయందు హఠాత్తుగా కలిగెడిశ్వాస, రక్తపుపోటువలనగాని ఇతర హృదయ వ్యాధులవలన

గాని కలుగవచ్చును. ఈ హార్దిక శ్వాసము, మామూలుగా శ్వాస కోశములకు సంబంధించిన ఉబ్బసపు దగ్గు - ఈ రెండు వ్యాధుల యందును వగర్పు అను లక్షణము ఒకే విధముగానున్నను రెండును ఒకదాని కొకటి సంబంధములేని భిన్న వ్యాధులని తెలియవలెను. జాగ్రత్తగా పరీక్ష జేయని డాక్టరుగూడ ఈ విషయమై పొరపాటు బడవచ్చును.

రక్తము నిలవయుండిపోవుటచే హృదయము ఆగి పోవుట, (congestive heart failure) అను వ్యాధిలో ఊపిరి అందకపోవుట, పాదములు నీరుపట్టుట, ఆ నీరు క్రమముగా పైకి ఎక్కుచుండుట- ఈ లక్షణములు ప్రారంభములో కలుగును. గుండె సరిగా రక్తమును చిమ్మలేక పోవుటచే ఈ వ్యాధి కలుగుచుండును. హృదయములో కొన్ని కవాటములు (వాల్వులు) పాడగుట చేతను, హెచ్చు రక్తపు పోటు చేతను ఈ వ్యాధి ప్రారంభించును. హృదయ వ్యాధికి మంచి ఔషధమని అందరికి తెలిసిన 'డిజిటాలిస్' అనెడి ఔషధము ముఖ్యముగా ఈ వ్యాధిలో ఉపయోగించును.

ఆధునిక వైద్యశాస్త్రపరిశోధనలు ఈ విషయమై ఇంకను కొంత అభివృద్ధిని హెచ్చుగా సాగించి ఈ వ్యాధిలో చాలవరకు మేలును చేకూర్చు చున్నవి.

రక్తపు పోటుచే కలిగెడి ముఖ్యమైన ఉపద్రవములు ఇచ్చట ఉదహరింపబడినవి. ఇంకను రక్తపు పోటుచే రక్తనాళములలో రక్తముఅక్కడక్కడ పేరుకొని ఆ రక్తపు తునకలు రక్తములో తిరుగుచు మస్తిష్కములోని రక్తనాళములలో అడ్డును కలిగించినచో పక్షవాతము కలుగవచ్చును. లేదా హెచ్చు రక్తపుపోటుచే మస్తిష్కములోని రక్త నాళములు బద్దలయినచో రక్తము మస్తిష్కములోని అన్య భాగములలో

వ్యాపించి వెంటనే మరణమును కలుగజేయవచ్చును. దీనినే శీర్షరక్త స్రావము (cerebral haemorrhage) అందురు.

హెచ్చు రక్తపుపోటు వలన నేత్రములు ఆకారములో కొంత మార్పు చెందును. వానియొక్క లోపలి భాగమును అక్షిగోళ దర్శిని (Opthalmoscope) అను యంత్రము ద్వారా చూచి దాని ఆకారమును బట్టి రక్తపుపోటు ఆ వ్యక్తికి ఉన్నదియు లేనిదియు స్థూలముగా తెలిసి కొనవచ్చును. ఈ అక్షిగోళదర్శినీ యంత్రముచే నేత్రములోని సూక్ష్మ రక్తనాళముల మార్పులను, నేత్రనాడి (optic nerve) పటిష్ఠతను, వ్యాధినికూడ నేత్ర వైద్యులు కనిపెట్టు చుందురు.

## మేహవాతముచే కలుగు హృదయవ్యాధి :

రక్తప్రసరణములో హృదయమునుజేరు రక్తము సరిగా రాకపోవుటచే ఆ రక్తము శరీరములో గాని ఊపిరితిత్తులలో గాని కొంతవరకు నిలచిపోవుటవలన, హృదయము చేయవలసిన పనికి ఆటంకము కలుగును. (congestive heart failure) ఇట్టి వ్యాధి హృదయములోని కవాటములలో జబ్బుల వలన కలుగును. వానిని హృదయ కవాట వ్యాధులందురు, (valvular diseases) ఇవి సాధారణముగా చిన్నతనములో మేహవాత వ్యాధికలుగుటచే హృదయ కవాటములు చెడిపోయి ఏర్పడుచుండును. చలి దేశములలో ఉన్నట్లే హిందూదేశము వంటి ఉష్ణదేశములలో కూడ ఈ వ్యాధి వ్యాపించి యున్నది. పసితనమందు కలుగు మేహవాత వ్యాధి వలన ఈ కవాట వ్యాధి కలుగును గావున చిన్నతనములో ఆ వ్యాధిని, జ్వరముతో కూడియున్నను లేకపోయినను, గుర్తించవలసిన అవశ్యకత ఎంతో కలదు. లేనిచో చిన్నతనములో హృదయ కవాటములో వ్యాధి ఒకసారి ఏర్పడినచో అది వయస్సు వచ్చిన తరువాతగూడ మరల వచ్చి

పైన చెప్పిన ఉపద్రవములను కలుగజేయవచ్చును. మహావాత వ్యాధి వలన సాధారణముగా ద్విపత్రకవాటనిరోధ మనెడి వ్యాధి (mitral stenosis) కలుగు చుండును. హృదయములో ఎడమకర్ణికకు ఎడమ జఠరికకు మధ్యను ఈ ద్విపత్రకవాట ముండును. ఈ వ్యాధిలో ఆ కవాటద్వారము మిక్కిలి సన్నగిల్లి పోవును. శస్త్రచికిత్స జాగ్రత్తగా చేసి ఈ కవాటమును కూడ సరిచేయుట ఆధునిక శస్త్రచికిత్సాభివృద్ధిలో ఒక విశేషము.

చిన్నతనమందే హృదయము సరిగా పనిచేయక పోవుట అనెడి హృదయవ్యాధి కలుగుటకు ఆహారమునందు విటమినులు లోపించుట కూడ ఒక ముఖ్యకారణమై యున్నది. అయితే విటమిను లోపములు గల ఆహారము ఈ వ్యాధిని ఏ విధముగా, ఏయే క్రమములో కలిగించు చున్నదో అది ఇంకను స్థిరపడచబడ లేదు.

కంఠములో పొరఏర్పడు 'డిఫ్థీరియా' మొదలయిన సాంక్రామిక సన్నిపాత వ్యాధులు రక్త ప్రవాహములో ఒక విధమైన స్తబ్ధత్వమును కలుగ జేయును. అందుచే శరీరములో నుండు రక్తనాళములు వెడల్పుగా సాగిపోవుట, దానివలన రక్తము అట్టి నాళములలో నిలిచి పోవుచు సరిగా హృదయమును చేరకుండుట మొదలయిన పరిస్థితులు కలుగును. ఇట్టి పరిస్థితియే రోగికి మూర్ఛ కలిగినప్పుడును, ఏదైన దెబ్బలు మొదలయిన ప్రమాదములు సంభవించి నపుడును, కొన్ని తీవ్రమైన శస్త్రచికిత్సలను జేయునప్పుడును కూడ కలుగవచ్చును.

సవాయి వ్యాధికూడ చిరకాలమునుంచి యున్న సాంక్రామిక వ్యాధియై యున్నది. దీనివలన బృహద్ధమని మొదలగు నాళములలో, కొంతభాగము సాగిపోవుట, గొట్టము కొన్నిచోట్ల లావుగా నుండుట మొదలయిన మార్పులు (aneurysm) ఏర్పడును.

# 7 జననేంద్రియ మూత్రకోశ వ్యాధులు

జననము లేక గర్భోత్పత్తికి సంబంధించిన అవయవ శ్రేణికి, మూత్రకోశావయవ శ్రేణికి, నిజమునకు శారీరక క్రియలలో ఏమియు సంబంధము లేకున్నను ఈ రెండును ఒకే అవయవములో సన్నిహితముగా నున్నవి.

ఉదరములో 'వప' అను పేశీ వెనుకను రెండు మూత్ర పిండములు రెండువైపులను కలవు. ప్రతి మూత్ర పిండములోను ఒక అల్లిక వంటి చిక్కైన నిర్మాణమొకటి ఉండి, దాని ద్వారా రక్తములోని నీరు మలినపదార్థములతో సహా,వడియగట్టబడుచుండును. శరీరమునకు అవసరములేని మాలిన్యము ఈ విధముగా బయటకు పోవుచుండును. మూత్రపిండములనుండి మూత్రము నీనులు (ureters) అనెడి నాళములద్వారా వస్తి లేక మూత్రాశయములోనికి

నిత్యము జేయుచుండును. ఈ వస్తి లేక మూత్రాశయములో చేరిన మూత్రమును మానవుడు తన ఇష్టమువచ్చినపుడు అప్పుడప్పుడు విడుచు చున్నాడు. ఈ ఇష్టము అనునది మస్తిష్కములో కొన్ని నాడీకేంద్రము లలో కొన్ని నాడీ తంతువుల ద్వారా కలిగెడి వేగ విశేషము. అనగా మూత్రము విడుచుట అనునది మస్తిష్కమందలి కొన్ని నాడీ కేంద్ర ముల అధీనములో నున్నది. ఈ నాడీ కేంద్రముల విషయము నాడీ వ్యాధులలో చర్చింపబడును. వస్తి లేక మూత్రాశయముతో మూత్ర మార్గము చేరియున్నది. దాని ద్వారా వస్తిలోని మూత్రమును మానవుడు బయటకు విడుచుచున్నాడు. పురుషులలో మూత్ర మార్గము లింగము నందును, స్త్రీల యందు ఈ మూత్రమార్గము యోనిమార్గము నకు ఊర్ధ్వమునను నిర్మింపబడి యున్నది.

మూత్రము అనునది చిత్రమైన కొన్ని రాసాయనిక ద్రవ్యముల సమ్మేళనము. అందుచేత మూత్రము శరీరములో అమ్లమును అనగా అమ్ల ధర్మమును ఒక నియమములో నిలుపుచున్నది. రక్తములో ప్రధాన ద్రవ్యములైన మాంసకృత్తులును, చక్కెరయును మూత్ర పిండములలో జరుగు వడబోతలో ఎంతమాత్రమును మూత్రములోనికి దిగకూడదు. కొన్ని వ్యాధులలో మాత్రమే ఇట్టి మాంసకృత్తులును, చక్కెరయును, ఆల్బుమిన్ అను శ్వేతధాతువు రూపముగాను, చక్కెర గాను మూత్రములో దిగి బయటకు పోవుచున్నవి.

బ్రైటీవ్యాధి అని అనబడు ఒక నంజు వ్యాధి ఈ మూత్ర పిండములకు సంబంధించినదై వానిని సరిగా పనిజేయనీయకుండగా పాడుచేయును. సాధారణముగా బాలురకు కలుగు ఈవ్యాధిలో జ్వరము, శరీరమంతయు నొప్పులు, ముఖము పొంగరించి యుండుట, ఆ ఉబ్బు తరువాత ముఖమునందే కాక శరీరమంతటను వ్యాపించుట, మూత్రము

చాల తక్కువగా పోవుట, మూత్రములో ఆల్బుమిన్ లేక శ్వేతధాతువు పోవుట మొదలయిన లక్షణములు కలుగును. ఈ వ్యాధి సాధారణముగా స్వల్పకాలములోనే తగ్గిపోవును. కాని కొంత మందికి చాలకాలము అణగియుండి ఏ బాహ్యలక్షణములను కనబర్చక గూఢముగా పుట్టుచుండును. ఇట్లు గూఢముగా తెలియకుండా వచ్చు మూత్రవ్యాధి తరుచుగా నడివయస్సులో వారికి కలుగుచుండును. దీనిని మూత్రపిండముల వాపు, లేక వృక్కశోథ (nephritis) అని వ్యవహరింతురు. ఈ వృక్కశోథ వలన రక్తపుపోటువ్యాధి కూడా కలుగ వచ్చును.

ప్రధాన రక్తపుపోటు వ్యాధిలోకూడ మూత్రములో ఆల్బుమిను పోవచ్చును గాని అది రక్తపుపోటు వచ్చిన అనంతరము మూత్రములో ఆల్బుమిను కలుగు లక్షణము. అందుచే ఈ రెండు వ్యాధులకును నిదానము,నందును చికిత్సలోను తేడాకలదు.

తరుణమైన వృక్కశోథ దానంతట అదే క్రమముగా పూర్తిగా తగ్గిపోవును. కాని చిరకాలనుండి యున్న వృక్కశోథ, దానిలో నంజు, నీరుపట్టుట రక్తపుపోటు మొదలయినవి చేరియున్నను లేకపోయినను, తగ్గుట చాల కష్టము, చికిత్సకూడ చాలకాలము తీసికొనును. ఇట్టి రోగులు ఆఖరుదశలో మూత్రము సరిగా కాకపోవుటచే, రక్తమందలి మలిన పదార్థములన్నియు రక్తములోనే నిలవజేరిపోయి, స్పృహ తప్పిపోవుట, వాతపుపోరులు, వగర్పు, వాంతులు, విరేచనములు కొన్నినాళములనుంచి రక్తముపోవుట మొదలయిన ఉపద్రవములతో బాధపడి మరణించవచ్చును. రక్తములో యూరికామ్లములు చేరియుండి, మూత్రముద్వారా అవి బయటకు పోకపోవుటచే ఇట్లు కలుగును, ఈ వ్యాధి పరిస్థితిని 'యూరేమియా' అని యందురు. అనగా మూత్రములో

పోవలసిన యూరితాళ్లములు రక్తములోనేయుండి సంచరించుట అని యర్థము.

కొంతమందికి మూత్రపిండములు బాగుగానే యున్నను, కొన్ని ఇతరకారణములచే హఠాత్తుగా మూత్రముకలుగకపోవుట తటస్థించినచో, ఆ పరిస్థితినిబట్టి కొంతమందికి ప్రాణరక్షణార్థము కృత్రిమమైన మూత్రపిండమును అమర్చి ఉపయోగించుచున్నారు, కాని కృత్రిమ మూత్రపిండము యొక్క ఉపయోగమును దాని ప్రక్రియయు గూడ చాల తక్కువగనే యున్నవి.

# 8 నాడీమండల వ్యాధులు

మానవుని పుర్రెలోనుండు మస్తిష్కము (మెదడు) లోనే నాడీమండలము నిర్మించబడినది. ఈ మస్తిష్కము క్రిందికి వ్యాపించిన భాగమే సుషుమ్నాకాండము. ఈ సుషుమ్నాకాండమునుండి అనేక నాడులు శరీరమంతయు వ్యాపించుచున్నవి. నాడీమండల నిర్మాణము నంతను ఒక విద్యుత్తంత్రి విధానముతో పోల్చవచ్చును. ఏవిధముగా బయటనుండివచ్చు విద్యుచ్ఛక్తి విద్యుత్తంత్రీ విధానములోని మూలకేంద్రమునకు వెళ్ళి, తిరిగి అచటనుండి తగు సమాధానములు వచ్చుచుండునో - అదేవిధముగా, శరీరమంతటను జరిగెడి క్రియలు, చలనములు మొదలయిన వన్నియు వివిధ నాడులద్వారా సుషుమ్నా కాండమునకు, తద్వారా మెదడునకు గొనిపోబడి అచ్చట నుండి కొన్ని నాడీతంతువులద్వారా తగు ఆజ్ఞలు వచ్చుచుండును. శరీరములోని ప్రతిభాగముయొక్క పోషణకై రక్తము సరఫరా కావలసినట్లుగానే, శరీరములో అన్ని అవయవములు సరిగా పనిచేయుటకు నాడీతంతువుల

ద్వారా సంవేగములు (ఆజ్ఞలు) అవసరమైయున్నవి. నాడీమండలము తనకు కావలసిన పోషణను రక్తము నుండియే పొందవలసి యున్నది. అలాగుననే రక్తము సరిగా ప్రసరించుట, రక్తనాళముల సంకోచ వ్యాకోచములు కూడ నాడీమండల క్రియలమీద ఆధారపడియున్నవి.

నాడీ మండల వ్యాధులలో పక్షవాతమనునది తరుచుగా కలిగెడి వ్యాధి. పక్షవాతము ఒక కాలు, లేదా చేయి, లేదా రెండును, పడి పోవుట, మూతివంకరగుట మొదలయిన లక్షణములతో కూడియుండును. నడిమివయస్సు దాటిన వారికి హఠాత్తుగా కాలు చేయి పడిపోవుట, లేదా మాటపడిపోవుట చాలమంది ఎరిగియున్నదే. కొన్ని అవయవము లకు ఆజ్ఞలనిచ్చు మస్తిష్క భాగములో నాడులకు శక్తిని సరఫరా జేయు చిన్న చిన్న రక్తనాళములకు అవరోధము కలుగుటచే, పక్ష వాతము హఠాత్తుగా సంభవించును. సవాయి మొదలయిన వ్యాధుల వలననో రక్తపుపోటువలననో, ధమనీ కాఠిన్యము వలననో, రక్త నాళములు వ్యాధిగ్రస్తములగుట ఇందుకు కారణము. ఈ వ్యాధి పరిస్థితులు ఈ పుస్తకములో ఇతర భాగములో వివరింపబడియున్నవి.

పక్షవాతము సాధారణముగా మెదడులోని రక్తనాళములలో ఏదో అడ్డు తగులుటచే సంభవించును. కాని ఒక్కొక్కచోట పక్షవాతము ఆ యా రక్తనాళము చిట్లుట, లేక తెగిపోవుటచేకూడ కలుగును. ఇట్లు మస్తిష్క రక్తనాళము చిట్లుటకు, లేదా తెగిపోవుటకు, మస్తిష్కరక్త స్రావమని (cerebral haemorrhage) పేరు. మస్తిష్కరక్త స్రావము వచ్చిన రోగికి (మూర్ఛ లేక స్పృహతప్పిపోవుట) చాల ఎక్కువగా నుండును. సాధారణముగా ఇట్టి రోగి వ్యాధినుండి విముక్తుడు కాజాలడు. కాని మస్తిష్క రక్త స్రావము చాలా అరుదుగా కలుగుచున్నది.

రెండు కాళ్ళను పడిపోవుట, లేక ఊరుస్తంభ వాతమనెడి (paraplegia) వ్యాధి ఒకటి కలదు. దీనిలో రెండుకాళ్ళను పడిపోవుటచే రోగి నడువజాలడు. సుషుమ్నా కాండము పాడగుట వలనగాని, దాని చుట్టును ఉండెడి ప్రదేశము పాడయి సుషుమ్నా కాండమును అది నొక్కుటవలన కాని ఈ వ్యాధి ఏర్పడుచుండును. ఈ రెండవ ప్రకారముగవచ్చు వ్యాధికి క్షయ కూడా ఒక కారణమైయున్నది. భారత దేశములో ముఖ్యముగా చిన్నవారికి సుషుమ్నా కాండముండెడి వెన్ను పాములో కశేరుక లనెడి ఎముకలకు క్షయ సోకుటచే ఒక వ్యాధి ఏర్పడుచున్నది. దీనిని 'పాట్' జబ్బు అని ఇంగ్లీషులో వ్యవహరింతురు.

సుషుమ్నా కాండములో తెల్లని పదార్థము ఎక్కువగా నున్నది. దాని ద్వారా ‡జ్ఞాన సంవేగములు ఊర్ధ్వముగా మస్తిష్కమునకును, *క్రియాసంవేగములు దిగువగా, వివిధనాడులద్వారా, వివిధావయవము లకును గొనిపోబడుచుండును. అందుచే ఊరుస్తంభవాతములో తరచు, శరీరాంగములకు పనులుచేయు శక్తియేగాక, స్పర్శజ్ఞానము కూడ తగ్గిపోవుచుండును. శరీరములో ఏ భాగములో స్పర్శ మొదలయినవి తగ్గిపోయినవో ఆ భాగమునకు అందిచ్చు నాడీతంతువులు కల సుషుమ్నా కాండ భాగము జబ్బువలన పాడయి యుండును.

ఊరు స్తంభ వాతములో మూత్రమును ఆపుకొన లేక పోవుట ముఖ్యమైన ఉపద్రవము. మూత్రముండెడి సంచి అనగా మూత్రాశయము (వస్తి) ఉదరములో దిగువను ఉన్నది. పసిపిల్లలకు మూత్రాశయము మూత్రముతో నిండగానే, అది నిండినదని తెలియజేయు జ్ఞాన సంవేగములు నాడీతంతువులద్వారా ఊర్ధ్వముగాను, క్రియాసంవేగములు మూత్రాశయమువైపును వ్యాపించుచు వస్తిని ముడుచుకొనునట్లుచేయుటచే

‡sensory impulses *motor impulses

మూత్రము బయటకు వచ్చును. కాని క్రమముగా పసిపిల్లవానికి వయస్సు వచ్చిన కొలదిని ఆ విధముగా మూత్రమును విడువవలదనియు, దానిని ఆపుకొని నియమముగా ఒకచోట విడువవలెననియు బోధించి చెప్పుటచే మస్తిష్కము వస్తిని తనవశము నందుంచుకొనును. దీనివలన మూత్రాశయమును మూసుకొనుట, మూత్రమార్గమును తెరచుట- ఈ రెండు అధికారములును మస్తిష్కమునకే ఉన్నవి.

ఊరుస్తంభవాతము వచ్చిన వారికి మస్తిష్కములోనాడీతంతువుల అధికారము తప్పిపోవుటచే రోగి వివశుడై ఏమియు చేయజాలక మూత్రమును తనకు తెలియకయే విడుచుచుండును ఒక్కొక్కప్పుడు వస్తి మూత్రముతో నిండిపోవును గాని, మూత్రము మాత్రము బయటకు రాదు. అప్పుడు కెథీటరు అను మూత్రరేచణనాళికను, అనగా గొట్టమును, మూత్రమార్గములో చొప్పించి మూత్రమును తీయవలసి వచ్చును. తరుచు ఇట్లు చేయుట వలన మూత్రనాళములో హానిని కలుగజేయు సూక్ష్మజీవులను ప్రవేశపెట్టుట యనెడి ప్రమాదము కలుగవచ్చును. అందుచే ఊరుస్తంభ వ్యాధి కలవారికి జాగ్రత్తగా మూత్రమును విడిపింప జేయుట ఒక విషమ సమస్య యగును,

నాడీమండలము ఆహారములో విటమినులలోపముచే,ముఖ్యముగా 'బి' విటమిను లోపముచే, సాధారణముగా పాడగుచుండును. అందుచే ఈ నాడీమండలమునకు సంబంధించిన వ్యాధులలో కూడ లక్షణములు కొన్ని అస్పష్టముగానుండును. కొన్నిచోట్ల- అనగా సుషుమ్నాకాండము చెడిపోయినను, *పరిధికి సంబంధించిన నాడులు వాచినను వ్యాధి లక్షణములు తీవ్రముగా కనబడుచుండును.

---

* పరిధి నాడులు = peripheral nerves

కాలుసేతులలో వాతపు లక్షణములు ఆ యా అవయవములలో పరిధికి సంబంధించిన నాడులు వాచుటచే కలుగును. ఈ గుణములు 'డిఫ్తీరియా' అనెడి వ్యాధిలోను, శరీరము యొక్క చయాపచయ క్రియలకు (metabolism) సంబంధించిన మధుమేహామువంటి వ్యాధిలోను కూడ సంభవించును. విటమిను 'బి' లోపముచే కూడ ఈ లక్షణములు కలుగును. ఈ రోగియొక్క కాళ్లుచేతులు తిమ్మిరెక్కుచు మొద్దుబారి పోవుచుండును. అతడు కొంచెము దూరము నడచుటకైనను చాలా కష్టపడును. ఈ పరిధి నాడులలో క్రియాతంతువులును (motor fibres), జ్ఞాన తంతువులును (sensory fibres) కూడ ఉండుటచే, ఆరోగియొక్క పేశాలలో (muscles) క్రియాశక్తి లోపమున్నట్లు పరీక్షచేసినగాని తెలియదు. మోకాళ్ళ దిగువను, మోచేతుల దిగువను కూడ స్పర్శజ్ఞానము లోపించి యుండును. సుషుమ్నాకాండ సంయుక్త శైదిల్యమను వ్యాధి (sub-acute combined degeneration of the spinal cord) ఒక విధమైన పాండురోగములో సంభవించును. కాని ఆవిధమైన పాండు రోగము మనదేశములో చాలాఅరుదుగా కన్పట్టుచున్నది. ఈ వ్యాదిలో పైనచెప్పిన లక్షణములే గాక, సుషుమ్నా కాండము శిధిలమయినట్లు సూచించు లక్షణములు కూడ కనబడును.

మస్తిష్కములో వాపు మొదలయిన వికారములను కలుగజేయునట్టి వివిధ సూక్ష్మజీవుల రకములనేకములు కలవు. వానిలో ముఖ్యమైన వానిని అంటు వ్యాధుల విషయములో చర్చించెదము.

మస్తిష్కములో వాపు కలిగినపుడు ముఖ్యముగా వాతపు పొరి లేక శరీరము వణకి పోవుట, కంపము కలుగును. వీనినే ఫిట్లులని

అంపరు. అయితే మామూలుగా ఎవరికైనను కలిగెడి వాతపు పొరి లేక కంపములు (convulsions) మస్తిష్కములో వాపుచే మాత్రమే గాక ఇంకను ఇతర కారణములచే కూడ కలుగవచ్చును. రోగి వివశుడై ఏమియు చైతన్యము లేక అతని కాళ్ళుచేతులు ముడుచుకొని కొట్టుకొను చుండును. ఇది శరీరమంతటనుగాని, ఏదో ఒక భాగములో గాని, ఉండ వచ్చును. ఇట్టి కంపములు అపస్మారమను వ్యాధిలోకూడ కలుగును. మన శరీరములో మస్తిష్కము లేక మెదడులోని నాడీ కేంద్రములు కాలిగోరు మొదలు శిరస్సువరకుగల సమస్త అవయవ ముల క్రియలను తమ వశమందుంచుకొని నిర్వర్తించు చుండునని వెనుక చెప్పియున్నాము. మస్తిష్కము లోపల ఏ ప్రక్కను కణములలో సంఘర్షణ లేక ఒరిపిడి (irritation) ఉద్భవించునో అచ్చటినుండి నాడీసంవేగములుబయలుదేరి,శరీరములో అమస్తిష్కభాగమునకు రెండవ వైపున ఉన్న అవయవముల పేశాలలో ఈ కంపములను కలుగ చేయును. ఈ విధముగా మస్తిష్కములో కుడిభాగములో సంఘర్షణ కలిగినచో శరీరములో ఎడమ వైపున కంపములు లేక వణుకు కలుగుటయు, మస్తిష్కములో ఎడమ భాగములో సంఘర్షణ కలిగి నచో శరీరములో కుడివైపున కంపములు కలుగుటయు తటస్థించును. అందుచేతనే శిరస్సునకు అభిఘాతము అనగా దెబ్బలు మొదలయినవి తగిలి మస్తిష్కముకూడ గాయపడినప్పుడును, మస్తిష్కములో ఆ ఇరుకులోనే కంతులు లేక గడ్డలు లేచినపుడును, పక్షవాతమును సూచించు కంపములు వణుకుకూడ కలుగుచుండును. దీనినే వాతపు పొరి, 'ఫిట్టు' అని అనుచుందురు. అయితే ఈ ప్రకారము మస్తిష్క ములో కంతి ఏ మాత్రముకూడ కలుగకనే కూడ ఇంకొక విధమైన

అపస్మారవ్యాధి కలుగవచ్చును. దానిని * నిజాపస్మారమని (Idiopathic Epilepsy) మనము అనవచ్చును.

ఈ వ్యాధి సాధారణముగా పసితనమందుకాని బాల్యమునందుకాని అంకురించి అనేక విధములైన లక్షణములను ప్రదర్శించుచుండును. ఈ లక్షణములయొక్క వైవిధ్యమునుబట్టి శాస్త్రజ్ఞులు ఈ అపస్మారములను క్షుద్రాపస్మారమనియు (Minor Epilepsy), మహాపస్మారమనియు (Major Epilepsy), నిజాపస్మారమనియు (Idiopathic Epilepsy), పేర్లు కల్పించి యున్నారు. క్షుద్రాపస్మారములో రోగికి ఒక్క క్షణము మాత్రమే స్పృహ తప్పిపోయి వెంటనే తెలివివచ్చును. మహాపస్మారముగల రోగులలో కొందరికి ఆ అపస్మారపు ఫిట్టు వచ్చుచున్నదను గుర్తు ఏదో విధమైన లక్షణముచే తెలిసి, ఏదో ఒక కేక హఠాత్తుగా వేసి స్పృహతప్పిపోయి, శరీరమంతటను వణుకుతోను, కంపములతోను కొట్టుకొనుట కలుగును. ఈ కంపములు సాధారణముగా రెండు నిమిషములకంటె ఎక్కువ ఉండవు. ఆ సమయములో రోగి తన నాలుకను కరచుకొనవచ్చును. తెలియకనే మలమూత్రములను బట్టలలో విడువ వచ్చును. ఈ కంపములు తగ్గిపోయిన తరువాత రోగికి తెలివివచ్చి, తలనొప్పియని బాధపడును. లేదా చాలకాలము అటులనే మత్తుగా పరుండి యుండును. ఇట్టి రోగముల నిదానమునకై, మస్తిష్కమునకు సంబంధించిన విద్యుచ్ఛలనములను వ్రాయుటకు 'ఎలెక్ట్రో ఎన్‌సెఫలో గ్రాము' అనెడి యంత్రముకూడ ఒక్కొక్కప్పుడు అవసరమగుచుండును.

---

* నిజవ్యాధియనగా లోపలనుంచి ఏవో కొన్ని కారణములచేత కలిగిన వ్యాధి యని అర్థము. ఆగంతుకమనగా బయటి కారణములచే కలిగినదని యర్థము.

ఇంకను కొన్ని వాత వ్యాధులలో రోగి వివశుడై తన శరీరావ యవములను కంపములతో వణికించుట కలదు. అట్టి వ్యాధులలో కొన్ని ఇచ్చట ఉదహరించుట మంచిది. పెరాలిసిస్ అజిటెన్సు అనెడి ఒక కంపవాతవ్యాధిలో బాధపడు రోగికి అతని పేశాలు, (కండలు)కొన్ని బిగుసుకొని పోయి అతనిచేతులు ఏదో మాత్రలను తయారుచేయుచున్నట్లు లేదా అతడు ఏదో మద్దెల వాయించుచున్నటులను వణుకుచుండును. చిన్నవారికి కలిగెడి మస్తిష్క శోధ యనెడి ఇంకొక వ్యాధి కలదు. అందులో కూడ ఈ లక్షణములు కనబడవచ్చును. ఈ వ్యాధిలక్షణములే చిన్నవారికిని, పెద్దవారికిని కూడ కనబడినచో ఆ వ్యాధిని "పార్కిన్ సోనిజం" అని అందురు. ఈ పార్కిన్ సోనిజం అను వ్యాధియును. పెరాలిసిస్ అజిటెన్సు అనువ్యాధియును పైకి కన్పించు లక్షణములను బట్టి ఒకే విధముగా నున్నను శరీరములో కలిగిన ధాతు వికృతిని బట్టి ఈ రెంటును భిన్నవ్యాధులని తెలుసుకొన వలెను.

'టిక్' లేక 'చలనము' అనెడి వాతవ్యాధి ఇంకొకటి కలదు. ఇది సాధారణముగా కొన్ని మానసిక కారణములచే కలుగుచుండును. ఇందులో ఏదో చిన్న అవయవము విరామము లేకుండగా కదలు చుండును. ఇట్టి రోగులలో కొంతమంది నుదురునో లేదా కనుబొమలనో, లేదా భుజమునో అప్పుడప్పుడు, ఏమియుకారణము లేకుండగనే కదుపుచుందురు లేదా ఎగరవేయు చుందురు. మేహవాతమున వచ్చిన కొంతమంది స్త్రీలలో కూడా ఇట్టిచలనములు అనేకములు కలుగుచుండును. ఆ వ్యాధిని 'కోరియా' యని పిలుతురు. అయితే యీ రెండు వ్యాదులకునూ తేడాకలదు. ఈ కోరియా అనువ్యాధితో బాధపడు పిల్లలు నిలుకడ లేకుండా కదలిపోవుచు, ఏదో అవయవమును కదుపుచు స్థిరము లేకుండా నుండురు. 'టిక్' లేక 'చలనము' అను

వ్యాధిలో ఇట్టి అస్థిరత్వము ఉండదు. కేవలము ఏదో అవయవము ఒకటి మాత్రము కదలుచుండును.

హిస్టీరియా అను వ్యాధిలో కూడ రోగికి వివశత్వముచే అనేక వ్యాపారములు, కంపములు, చలనములు కలుగుచుండును. ఈవిషయమై చర్చించుటకు ముందు మనస్సునకు, శరీరమునకు గల సంబంధమును గూర్చి కొంత చెప్పుకొందము.

శరీరములో వివిధ అవయవములలో పుట్టెడి వ్యాధులవలన వివిధ లక్షణములు కలుగు చుండునను విషయము చాలాకాలము నుంచి వైద్యులకు తెలిసిన విషయమే. ఉదాహరణకు ఒకరికి జ్వరమున్నచో దానితోపాటు అతనికి తలనొప్పి, ఒడలినొప్పులు, దగ్గు, వాంతి మొదలయిన లక్షణములు కలుగు చుండును. శరీర వ్యాధులను కలుగజేయుటకు ఈ కారణములే గాక ఇంకను కొన్ని యంత్రాంగములు కలవని శాస్త్రీయముగా ఈ మధ్యనే తెలిసినది.

ఆదుర్దాతో గూడిన నాడీ దౌర్బల్యము (anxiety neurosis) అని నాడులకు సంబంధించినవ్యాధి ఒకటి కలదు. పూర్వపు డాక్టరులు వర్ణించిన నాడీశక్తిహీనత (neurasthenia) అను వ్యాధియును, ఈ ఆదుర్దాతోకూడిన నాడీ దౌర్బల్యమును ఇంచు మించు ఒకటేయని చెప్పవచ్చును. ఈ వ్యాధిలో ఎక్కువగ ఆదుర్దా, గుండెదడ, తలపోటు, చెమటలుపుట్టుట, ఏ విషయముమీదను మనస్సును నిలుపలేకపోవుట, నిద్రపట్టక పోవుట, ఏపనియు చేయలేకపోవుట, మొదలగు బాధలున్నా యని రోగి చెప్పుచుండును. పరీక్షించినచో డాక్టరుకు ఏ వ్యాధియు కనబడదు. రోగి అతిశయోక్తితో చెప్పెడి ఏదో స్వల్పమైనట్టి వ్యాధి ఏదైనను కొంచెమున్నను ఆ వ్యాధి మామూలుగా అందరకును ఇన్ని లక్షణములను పుట్టించునట్టి వ్యాధికాదు. అనగా, డాక్టరు పరీక్షించినచో

ఉంటుమంటు ఏ వ్యాధియు ఏర్పడదు. రోగికి మాత్రము ఇది బ్రహ్మాండమైన వ్యాధిగా కనబడును.

ఆమర్దాతో గూడిన నాడీ దౌర్బల్యమను వ్యాధిని కనిపెట్టుట కష్టముకాదు. హిస్టీరియాలో రోగి మనస్సులో గూఢముగా బాధ ఉండును. ఈ వ్యాధి అట్టిదికాదు. ఈ వ్యాధిని గుర్తించుటకంటె హిస్టీరియా వ్యాధినే గుర్తించుట కష్టము. హిస్టీరియా రోగికి ఏదైన చిక్కయిన సమస్య వచ్చినపుడు మనుస్సులో చాల గాభరా పడును. అందుచేత తన స్నేహితుల వద్దనుండి ఆత్మబంధువుల వద్దనుండి ఒకవిధమైన సానుభూతిని పొందవలె ననెడి ప్రయత్నములో అనేకరకములైన లక్షణము లను వ్యాధిగా ప్రదర్శించును. తాను అంతకు పూర్వము ఇతరుల వ్యాధులను, బాధలను చూచిన జ్ఞానమును, అనుభవమును మనస్సులో నుంచుకొని అట్టి వ్యాధులను ప్రదర్శింప నారంభించును. ఈ విధముగా హిస్టీరియాలో పక్షవాతము, అనగా కాలుచేతులు పడిపోవుట, మూతి వంకరగుట, మొదలయిన లక్షణములు, శరీరములో అనేక భాగములలో కంపములు, వణుకు మొదలయిన లక్షణములు కలుగుచుండును. ఇక ఆ హిస్టీరియా రోగికి సానుభూతి వచనములు చెప్పు స్నేహితులు, ఆత్మబంధువులు మొదలయినవారు ఉన్నయెడల, వణుకు, కంపములు ముఖ్యముగా బయలుదేరును. బలవంతముగా వానిని మనము ఆపిన కొలదిని అవి ఎక్కువగుచుండును. ఒకప్పుడు హిస్టీరియా రోగమునకు అపస్మారరోగమునకు పైకి పోలికలు చాల కనపడును. చూచుటకు రెండువ్యాధులు ఒకే విధముగా నుండవచ్చును. కాని ఈ రెండింటికిని చాల తేడాకలదు. అపస్మారరోగికి ఫిట్టు వచ్చి పడిపోవునపుడు శరీరమునకు దెబ్బలు తగిలి, ప్రమాదము కూడ కలుగవచ్చును. కానీ హిస్టీరియా రోగి అట్టి ప్రమాదము కలుగకుండ జాగ్రత్త పడుచుండును.

ఈ హిస్టీరియావ్యాధి సాధారణముగా చిన్నవయస్సుగల ఆడవారిలో కన్పించినను, అక్కడక్కడ పెద్దవారికిని కొంతమంది పురుషులకు కూడ కలుగుచున్నది. ఇంకొక విషయమును బట్టి కూడ హిస్టీరియాకు అపస్మారమునకును తేడాను తెలుసుకొనవచ్చును. అపస్మారములో కంపములు, వణుకు, వానివేగము (ఫిట్టు) ఎచ్చటను గూడ రెండు నిముషములకంటె ఎక్కువకాలము ఉండదు. హిస్టీరియాలో ఈ కంప ములు కొన్ని నిముషములు, గంటలు, కూడ ఉండవచ్చును. హిస్టీరియా రోగికి ఒక విధమైన మానసిక దౌర్బల్యముచే ఆ లక్షణములు పుట్టు చుండును. అంతమాత్రముచే అవి దొంగజబ్బు అని అనుకొనకూడదు. దొంగవేషము వేసినవాడు తనకులేని లక్షణములను రోగివలె నటించును. హిస్టీరియాలో అట్లు గాక మానసిక దౌర్బల్యముచే ఆ లక్షణములు పుట్టుచుండును.

మనస్సునకును, శరీరమునందు కలుగు వ్యాధి లక్షణములకును పరస్పర సంబంధము మనశ్శరీర వ్యాధులలో (psychosomatic diseases) కనిపించుచున్నది. వానిలో మనస్సుచే శరీరమునకు ఒక విధమైన అభిఘాతము కలుగును. ఇంతివరకు ఇట్టి వ్యాధులన్నియు కేవలము శరీర వ్యాధులనియు, ఇవి కొన్ని రకముల సూక్ష్మజీవులు, అభిఘాతము మొదలయిన బాహ్యకారణములచే మాత్రము కలిగినవని చెప్పుచు వచ్చినాము. కాని అట్టి వ్యాధులు ఆ కారణములచే గాక, నిజముగా మనస్సునకు కలిగిన కొన్ని అభిఘాతముల చేత, లేదా కోపము, విచారము మొదలయిన మనోవికారములచేత శరీరములో వ్యాధులుగా పరిణమించుచున్నవనియు, అందుచే వానిని మనశ్శరీర వ్యాధులనియు పేరు పెట్టుచున్నారు. హిస్టీరియా కూడ ఇట్టి మనశ్శరీర వ్యాధులలో నొకటియా కాదా యను సందేహము రావచ్చును. హిస్టీరియాకును, ఈ

మనశ్శరీరవ్యాధికిని ఎంతో తేడా ఉన్నది. హిస్టీరియా వలె దానిలో ఆ యా లక్షణములు కలుగునప్పుడు గూఢమయిన అంతర్మనస్సునకు సంబంధించిన వికారమేదియు నుండదు. ఆమాశయవ్రణము, శ్వాసకోశములకు సంబంధించిన వగర్పు, హెచ్చురక్తపుపోటు, అస్థికి సంబంధించిన కీళ్ళనొప్పులు మొదలయినవి ఈ రకములో, అనగా, ఇట్టి మనశ్శరీర వ్యాధులలో చేరును. ఈ వ్యాధులను ఇంకొకచోట చర్చించితిమి. ఇంతకు, ఇందులో గమనించవలసిన విషయమేమనగా,రోగిని పరీక్షించినపుడు ఆతని మానసిక స్థితినికూడ సరిగా కనిపెట్టి దాని ననుసరించి కూడ కొన్ని ఔషధములను, చికిత్సా ప్రయోగములను నిర్ణయించుకొనవలెను.

ఇంకొక విషయమేమనగా, మనస్సునకు తీవ్రమైన దెబ్బ తగిలినపుడు అది ఒకప్పుడు ఉన్మాదముగా (పిచ్చి) పరిణమించును. పైన జెప్పిన ఈ మనశ్శరీరవ్యాధులు మనశ్శరీరములకు మధ్యగల సరిహద్దుకు సంబంధించిన వ్యాధులుగాను, ఇక వర్ణించబోయెడి పిచ్చి, ఉన్మాదము మొదలయిన వ్యాధులు కేవలము మానసిక వ్యాధులుగాను నిర్దేశింపబడినవి. మానవుల స్వభావము ప్రవర్తన మొదలయినవానికి సంబంధించిన విషమ సమస్యలను ఆలోచించినపుడు 'మనస్సు' అనునది శరీరములో ఎక్కడ, అనగా, ఏ ప్రదేశములో ఉండును అనువిషయమే గొప్ప చిక్కయిన ప్రశ్న. వైద్య విద్యార్థులు శరీరములో మస్తిష్కము నంతయు జాగ్రత్తగా కోసి, సూక్ష్మదర్శినీ యంత్రము మొదలయిన పరికరములతో జాగ్రత్తగా సూక్ష్మముగా పరీక్షించినారు కాని, దానిలో మనస్సు అనునది సరిగా ఎక్కడ ఉండునో నిర్ధారణ జేయలేకపోయినారు. మనస్సు అనునది మానవులకేగాక జంతువులకు, ఆఖరుకు మొక్కలకు, వేయేల,జీవము గలిగిన ప్రతిచిన్న వస్తువునకును ఉన్నది.

ఈ మనస్సు లన్నిటిలోను మాటాడు మనస్సు చాల క్లిష్టమయినది. ఎందుచేతననగా మిగిలిన జంతువులవలెగాక, మానవుడు మాట్లాడగలడు. బహుశా జంతువుల వలెనే మానవులకు కూడ మాటలతో అభిప్రాయము చెప్పెడి శక్తి లేకపోయినచో, జీవితములో ఈ చిక్కు కలుగక పోయెడిది. కుడిచేతితో పనులుచేయు అలవాట్లు గలవానికి మస్తిష్కవల్కలములో ఎడమవైపున, దాని దిగువను, కొన్ని నాడీకేంద్రము లుండునని, అవియే జ్ఞాపకశక్తికి జ్ఞానమునకును కేంద్రములని చెప్పుకొని యుంటిమి. మస్తిష్కములోని ఇట్టి భాగములతో సంబంధించి రక్తనాళములలో అడ్డు కలిగినచో, అనగా ఎడమ మస్తిష్కములో ఈ అడ్డు సంభవించినచో, కుడికాలు, కుడిచేయి మొదలయినవి పడిపోవుట, కుడివైపు మూతి వంకరగుట, ఇవేగాక ఒకప్పుడు రోగికి చిత్రముగా మాటపడిపోయి కొన్ని విషయముల జ్ఞాపకశక్తి పోవుట సంభవించును. రోగి చిరకాలమునుండి పరిచితమైన పేర్లు, తాను తరచు వాడుచుండెడి వస్తువుల పేర్లు మొదలయిన వానినే మరచిపోవుచుండును. ఆ వస్తువులు తనకు కావలెనని యున్నను ఆ పేర్లను చెప్పలేడు. మిగిలిన విషయములలో రోగియొక్క స్మృతి మామూలుగానే ఉండును. వైకుంఠపాళి ఆడుచున్నప్పుడు పందెపుకాయ తిరిగితిరిగి, అప్పుడప్పుడు నిచ్చెనలు ఎక్కుచు, చిన్నచిన్న పాములను దాటుచు, అతికష్టము మీద పైకివెళ్ళి, చివరకు అదృష్టము లేక పోవుటచే ఒక్కసారి పెద్దపాము నోట్లోపడి పటము అడుగున ఉండు మొట్టమొదటి గడిలోనికి వచ్చినపుడు ఆ ఆటగాని మనస్థితి ఎట్లుండునో, ఈ రోగి తనకు కావలసిన వస్తువుల విషయమై కష్టము మీద అన్నిమాటలు చెప్పుచు, చివరకు తనకు చిరకాలమునుండి పరిచితమైన వస్తువును, మనస్సులో కోరిక యున్నను, బయటవారికి మాటలతోగాని సంజ్ఞలతోగాని, తెలియజేయ లేక పడెడి అవస్థ ఆ విధముగా నుండును. ఈ విధముగా పూర్వపు

అనుభవములు మొదలగునవి మస్తిష్కమున ఏభాగములలో నిలువజేయబడిన యున్నవో శరీరశాస్త్రజ్ఞులకు తెలియును. కాని ఈ అనుభవములను ఉపయోగించుకొను పద్ధతి, జీవితములో కోరికలను తీర్చుకొనుటకు ప్రవర్తించు విధానము, ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క విధముగా నుండుచున్నది. శరీరములో రక్తప్రసరణము, జీర్ణశక్తి, మూత్ర విసర్జన మొదలయిన క్రియలు యంత్రములలో వలెనే కొన్ని నియమములతో జరిగిపోవుచున్నప్పటికిని మానవులలో ప్రవర్తన మాత్రము అట్లు ఒకే విధముగా నుండదు. ఒక్కొక్కని ప్రవర్తన విలక్షణముగా, ఇతరులకు భిన్నముగా, ఆతని వంశము, వారసత్వముల వలనవచ్చు గుణములు, చదువు, స్నేహము, చుట్టుప్రక్కల పరిసరములు, అంతస్స్రావగ్రంథులు, జీవరసాయన ప్రతిక్రియలు మొదలయిన విశేషములను బట్టి మారుచుండును,

మానవ శరీరములో జీవ రసాయన ప్రతిక్రియవలన అనేక విధములైన క్లిష్టమయిన మార్పులు సంభవించుచుండును. మానవులకు సంబంధించిన జీవ రసాయన శాస్త్రములో ఈ మధ్య విశేషమైన పరిశోధన జరిగి విజ్ఞానాభివృద్ధి కలిగినది.

ఉన్మాదము (Psychosis) అనగా పిచ్చి. ఈ పిచ్చి, కోపము, శోకము మొదలయిన మానసికములగు అభిఘాతములవలననే గాకుండగ ఒకప్పుడు కొన్ని అంటువ్యాధుల వలన పుట్టెడి విషముల వలనను, సహజ శారీరక వ్యాధుల వలనను, కొంతమందికి కలుగుచుండును.

తీవ్రోన్మాదము (Mania): — ఈ రోగికి ఒకప్పుడు పిచ్చి చాల తీవ్రముగాను, ఒకప్పుడు చాలమందముగను, ఉండును. తీవ్రావస్థలో రోగి మిక్కిలి చురుకుగానుండి, మాటల ధోరణిని ఒక విషయము నుండి మరియొక విషయములోనికి సందర్భము లేకుండగా చురుకుగా

మార్చివేయుచుండును. ఇక మాంద్యావస్థలో రోగికి చుట్టు ప్రక్కల ఏమి ఉన్నను అక్కరలేదు. వాని ప్రసక్తి ఏమియు పట్టించుకొనడు. ఆ సమయములో శరీరములోకూడ క్రియలు చాలమందముగానే నడచును. ఇట్టిస్థితిలోనే రోగి ఆత్మహత్య చేసికొను ప్రమాదము కలదు. ఈ మాంద్యావస్థ ఈ వ్యాధిలోనే గాకుండ కొంచెము కొంచెముగా విషపడిశము (Influenja) మొదలయిన వ్యాధులలోకూడ కలుగ వచ్చును,

నిరుత్సాహోన్మాదము (Schizophernia):— అను మానసిక వ్యాధి కలదు. ఈ వ్యాధి జీవితము నెట్లు గడపగలమా, కుటుంబభారము నెట్లు వహింతుమా అని బాధ పడెడి యువకులలో కలుగుచుండును. ఈ రోగికి బాహ్యప్రపంచ జ్ఞానమేమియును లేక తాను సృష్టించుకొనిన ఆంతరంగిక ప్రపంచములో మునిగి ఏవో వెర్రి ఆలోచనలతోను చేష్టల తోను కూడి యుండును,

సాధారణముగా ఈ క్రింప జెప్పిన లక్షణములలో వేనినైనను ప్రదర్శించినచో రోగి ఉన్మాదరోగియని మనము నిర్ణయించ వచ్చును.

విభ్రాంతి (Hallucination):— ఏవో లేని విషయములను కంటితో చూచినట్లు, లేదా విన్నట్లు. లేదా వాసనచూచినట్లు విభ్రాంతితో మాటలు చెప్పుట. ఈ విధముగా రోగి ఏవో చిత్రమైన రంగులను చూచు చున్నాననియో, మంచిసువాసనలు కొట్టుచున్నవనియో చెప్పుచుండును ఆ రోగి చుట్టుప్రక్కలలో అట్టి ఆలోచనలకు ఆధారమేదియు కనబడదు,

భ్రమ (Illusion):—ఒక వస్తువునుచూచి, ఇంకొక వస్తువు అనుకొనుట అనగా భ్రమజెందుట.

మిథ్యాజ్ఞానము (Disorientation):—తనకు అంతకు ముందు పరిచితమైన వస్తువునో, ప్రదేశమునో, వ్యక్తినో, రోజునో వేళనో, తప్పుగా నిర్దేశించుట. ఉదాహరణకు ఈ రోగి ఉదయము 7 గంటల వేళ ఎండచూసి సాయంకాలము అయినదనును. ఇట్టిరోగులు తాము ఈ మధ్యనే కని విని అనుభవము పొందిన విషయములనే మరచిపోవు చుందురు.

మిథ్యానిర్ణయము (Delusion):—చుట్టు ప్రక్కల ఆసమయ మున ఉండెడి పరిస్థితులకు, తనకు ఏమియు సంబంధములేని తప్పుడు నిశ్చయములను చేసికొనుట. సామాన్యోన్మాద వాతము వలన బాధపడు చుండు బీదవాడొకడు తన దగ్గర కొన్ని లక్షల రూపాయలున్నవనియు, లేదా తాను ఒక మహారాజుననియు అనుకొనుచుండును. సవాయివ్యాధి జీర్ణించుటచే ఇట్టి వ్యాధి కలుగుచుండును.

ఈ ఉన్మాదములోనే ఇంకొకరకము రోగి ఎవరోతనను కొట్టబోవుచున్నారని అకారణముగా భయపడుచు, బాధపడుచుండును. ఇట్టి అనుమానములచే ఒకప్పుడు తనకు అపకారమునుకూడ చేసికొను చుండును.

అమెరికాదేశములో ప్రతిసంవత్సరముకూడ ఈ ఉన్మాద వ్యాధి వృద్ధి చెందుచు ఇది అక్కడ ఒక సమస్యగా పరిణమించినది. ఆ దేశ ములో క్షయవ్యాధికై ఇంతకు పూర్వము కట్టబడిన ఆరోగ్యకేంద్రములు పనిలేక మూసివేయబడుచుండగా, ఈ మానసిక వైద్యశాలలలో ఖాళీలు లేక ఇంకను క్రొత్తవానిని ఎక్కువగా నిర్మించవలసిన అవశ్యకత ప్రతి సంవత్సరము ఏర్పడుచునే యున్నది. కేవలము ధనము మాత్రము ఎక్కువగాగల దేశములలోను, జీవితములోను, ఎట్టిమార్పులు చిక్కులు

కలుగుచున్నవో తెలిసికొనుటకు ఇదియొక నిదర్శనము. మానవ
సుఖమునకు కావలసినవేవి యనెడి తత్వాన్వేషణ సరియైన పద్ధతిలో
జరుగు వరకును, కేవలము ధనసంపాదన మాత్రము ఈ మానసిక
వ్యాధులను పోగొట్ట జాలదు.

# 9 పాండురోగములు

రక్తకణములలో ఎర్రకణముల సంఖ్య తగ్గినను, వాని పటిష్ఠత తగ్గినను రక్తమునందలి హెమోగ్లోబిన్ అను ఎరుపురంగు తగ్గినను, ఆవ్యాధిని పాండురోగము అందురు. రక్తములోని ఎర్రకణములు మనము ఊపిరి పీల్చుగాలినుండి ఆక్సిజనును, (ప్రాణవాయువు) గ్రహించి దానిని శరీరమంతటకును అందించును. ఆరోగ్యవంతుని శరీరరక్తములో, సగటున ఈ ఎర్రకణములు ఒక ఘన మిల్లీమీటరు ప్రదేశమునకు 50 లక్షల వరకును ఉండును. ఇవి ఎముకలలో నుండు మూలుగులో పుట్టును. ఇవి పుట్టి 90 రోజులు జీవించి ఆ తరువాత నశించి పోవు చుండును. ఈ ఎర్రకణములు వృద్ధిపొందుటకు ఒక ప్రత్యేక ద్రవ్యము కలదు. ఈ ప్రత్యేక ద్రవ్యము ఆహారమనే బాహ్యకారణమువలనను, ఆమాశయములోనే పుట్టుచుండెడి ఒక అభ్యంతర కారణమువలనను తయారగుచున్నది. రక్తములోనిఎరుపురంగు(హెమోగ్లోబిన్)ఐరన్ లేక ఇనుము (లోహము) నుండి పుట్టుచున్నది. రక్తములోని ఎరుపుదనము తగ్గినదంటే ఇందులో ఈ లోహపు భాగము తగ్గినదన్నమాట. అందుచే

మనము తినెడి ఆహారములో లోహము తగినంతవరకు ఉండునట్లుల చూచుకొనవలసియున్నది. ఇంతేగాక మనము ఆహారము ద్వారా తినెడి లోహము శరీరములో వినియోగము చెందుటకు, అనగా వంటబట్టుటకు, మాంసకృత్తులను 'సి' విటమినును, తీసికొనవలసి యున్నది. ఇక పైజెప్పిన వన్నియు సరిగా ఉండి, అనగా రక్తములోని ఎర్రకణములు సరిగా తయారయి, వానిలో లోహము మొదలయినవి సరిగా నున్నప్పటి కిని, ఏ కారణముచేనైనను శరీరమందలి ఏ భాగమునుండియైనను, రక్తము కారిపోవుచున్నచో, పాండురోగము కలుగును. స్త్రీలు ప్రతినెల బయట ఉన్నప్పుడును, ప్రసవ సమయములోను రక్తము పోవును. అంతేగాక, వారి గర్భములోనున్న శిశువుల కొరకు కూడ ఆ స్త్రీల శరీరములోని రక్తము వ్యయము కావలసియున్నది. అందుచే గర్భిణీస్త్రీల కును, ప్రసవించిన స్త్రీలకును సామాన్యముగా పాండురోగము కలుగుచునే యుండును. రక్తార్శస్సు లేక మూలశంకద్వారా రక్తము పోవుటచేత పాండురోగము స్త్రీపురుషుల కిరువురకును కలుగుచునేయుండును. ఇది గాక మలేరియా మొదలయిన వ్యాధులను పుట్టించెడి సూక్ష్మక్రిముల వలన శరీరములో పుట్టెడి కొన్ని విషములచేతను, లేదా ఆహారము ద్వారానో, ప్రమాదమువలననో, లోపలికి పోయిన విషముల వల్లను రక్తములోని ఎర్రకణములు నశించుచుండును. ఇన్ని భిన్నకారణములచే కలిగెడి పాండుత్వము ఒక లక్షణము మాత్రమే అనియు, ఈ లక్షణము గల అసలు వ్యాధిని గుర్తించి చికిత్సచేయుట అవసరమనియు తెలుసు కొన వలెను.

ఈ విధముగా మనము తినెడి ఆహారలోపముల వలనను, రక్తకణములు సరిగా తయారు కాకపోవుట వలనను, స్త్రీలకు తరచు గర్భము కలుగు నప్పుడును, సూక్ష్మజీవుల వలనను మనదేశములో

పాండురోగము హెచ్చుగా కలుగుచున్నది. కొన్ని దేశవాళీ ఔషధములు, ముఖ్యముగా లోహములు, ఎముకలలోని మూలుగును పాడుచేయున వగుటచే వానివలన కూడ తీవ్రమైన పాండురోగము పుట్టుచున్నది.

నిపుణుడైన వైద్యుడు, కేవలము కంటిరెప్పలను, నాలుకను చూచినంత మాత్రమే పాండురోగమున్నదని స్థిరపరచక, రక్తమును జాగ్రత్తగా పరీక్షించి పాండురోగము ఎంతవరకు ఉన్నదో కనిపెట్ట వలెను. రక్తపరీక్ష అయిన తర్వాత శరీరమంతయు పరీక్షించి ఆ పాండురోగమును కలిగించిన కారణములను పూర్తిగా తెలుసు కొనును.

మనదేశములో చలిజ్వరము (మలేరియా) ను కలిగించెడి సూక్ష్మక్రిములును, కొంకి పురుగును, (Hook worm) పాండు రోగమును కలిగించుటలో ప్రధానమైన పాత్ర వహించుచున్నవి. చలిజ్వరమును కలిగించు సూక్ష్మక్రిమి రక్తములోనే తిరుగుచు రక్తము లోని ఎర్రకణములను నశింపజేయుచుండును. ఇంక కొంకిపురుగులు ప్రేగులలో అక్కడక్కడ పట్టుకొనియుండి రక్తమును పీల్చుచుండును; వాని వలన కలిగిన సూక్ష్మమైన రంధ్రముల ద్వారా రక్తము స్రవించి పోవుచుండును.

చిరకాలమునుంచి ధాతువులలో మూలమూలల ఉండెడి చీము పాండు రోగమును కలుగజేయు చున్నదని యీ మధ్య జరిగిన శాస్త్రపరిశోధనల వలన తెలియుచున్నది. ఇట్టిచీమును కనిపెట్టుటయు, కనిపెట్టినను దానిని తొలగించుటయు మిక్కిలి కష్టమగును. భారత దేశ ములో ఇటువంటి పాండురోగములే హెచ్చుగా నున్నవని కొంతమంది చెప్పుచున్నారు. మనదేశములో ఇదేగాక చిరకాలమునుండి వదలకుండగా యుండు శ్లీపదము (బోదకాలు) మొదలయినవానిలోకూడ ప్లైరిప్తాకాకస్,

స్టాఫిలోకాకస్ మొదలయిన సూక్ష్మజీవులు చేరి పైజెప్పినట్లు చీము మొదలయిన వానిని కలిగింపవచ్చును. చిరకాలమునుంచి ఉన్న ఇట్టి వ్యాధులలో సూక్ష్మజీవుల ఉనికిని జాగ్రత్తగా గుర్తించి తగు చికిత్స చేయకపోయినచో వ్యాధి పూర్తిగా కుదరదు.

లోహము (ఇనుము) తక్కువగుటచే కలుగు పాండురోగములు అన్ని జాతులలో అన్ని వయస్సుల వారికిని కలుగుచున్నవి. మిగిలిన కారణములకంటె ఈకారణమువలనే పాండురోగము ఎక్కువగా కలుగుచున్నది. యకృత్ సారము(Liver Extract). విటమిను బి 12, ఇట్టి ఔషధములు పాండురోగములకు మంచి ఔషధములైనను, లోహము తక్కువయిన పాండురోగములలో పనిచేయుటలేదు. ఇంతకుచెప్పవచ్చిన దేమనగా, పాండురోగము ఒక ప్రత్యేక వ్యాధికాదు; ఏదో యింకొక వ్యాధివలన కలిగిన ఒక లక్షణము మాత్రమే, అనుకొని దానిని కలిగించెడి వ్యాధికి కారణములు జాగ్రత్తగా కనిపెట్టి చికిత్సను నిర్ణయించు కొనవలెను.

పాండురోగము కల రోగి సాధారణముగా నీరసముతో బాధపడుచు కొంచెము పనిచేయుసరికి ఆయాసపడును. ఎక్కువగా పాండురోగమున్నచోట్ల క్రియావంతములగు అవయవములకు రక్తము సరిగా సరఫరాకాకపోవుటచే ఆ యా అవయవములు సరిగా పనిచేయవు. ఇందువలన తలదిమ్ము, తల తిరుగుట కలుగవచ్చును. మస్తిష్కములో ప్రసరించెడి రక్తము బొత్తిగా తక్కువగా నుండుటచే తల దిమ్ము మొదలయిన లక్షణములు కలుగును. అందుచే పాండురోగములో హెచ్చుగా విశ్రాంతిపుచ్చుకొనవలెను. పాండురోగి కళ్ళు రెప్పలు లాగి చూచినంత మాత్రమున రక్తము లేదనియు, పాండురోగమున్నదనియు వైద్యులేకాక సామాన్యజనులే చెప్పగలరు. ఈ వ్యాధికి లోహము

(ఇనుము), విటమిను బి 12 ముఖ్యమైన ఔషధములని చెప్పియే యుంటిని. మరియు ఆహారములో మాంసకృత్తులు విటమినులు తగినంతగా ఉన్నగాని శీఘ్రముగా గుణము కనిపించదు. ఆ యా పాండు రోగమును కలుగజేయు కారణమును (రక్తార్శస్సు, కొంకి పురుగులు మొదలయినవి) జాగ్రత్తగా తెలిసికొని దానికి ముఖ్యముగా చికిత్స చేయవలెను.

చిరకాలమునుంచి అశ్రద్ధతో సరియైన ఔషధము తీసికొనని కొందరు పాండురోగులకు ఆరోగ్యవంతుల రక్తము కూడ ఎక్కించుట అవసరమగును; కాని ఆ ప్రక్రియను అత్యవసరమైనప్పుడును, తగు జాగ్రత్తలన్నిటిని తీసికొనిన తరువాతను ఆచరించవలయును.

ఎర్ర కణములు, తెల్లకణములు, రక్త ద్రవము ఇవన్నియు, కలిసియున్న ద్రవ పదార్థమే రక్తము. పాండురోగములో ఎర్రకణములే మిక్కిలి తక్కువగా నుండుటచే వానినే భర్తీ చేయవలసి యున్నది. అందుచేరక్తదానము, అత్యవసరమైనచోట చేయునపుడు తగుజాగ్రత్తలు తీసికొని ఆరోగ్యవంతుడైన ఇంకొకని రక్తమును ఈయవలయును. లేదా అందుండెడి రక్తకణములు యుక్తముగా కలిగిన ఔషధమును ఎక్కించ వచ్చును. ఇట్లు రక్తమును ఎక్కించుట అను ప్రక్రియ ఎన్నియో పరీక్షలను జేసి, ఎన్నియో జాగ్రత్తలను తీసికొని చేయవలసి యున్నది. లేక పోయినచో చాల అపాయములు, మరణముకూడ కలుగ వచ్చును. ఆ రక్తదానము చేయువాని రక్తముకూడ రోగి యొక్క రక్తమునకు సరిపడవలెను, ఇందులకై ముందుగా వానిని జాగ్రత్తగా పరీక్షించి ఆ వ్యక్తియొక్క రక్తము ఈ రోగికి పనికివచ్చునో లేదో స్పష్టముగా ముందు నిర్ణయించ వలెను.

పాండు రోగములనేగాక, ఎవరికైనను ఏ కారణములచే నైనను రక్తస్రావము ఎక్కువ అయినవారికిని, దానిచే నాడి సన్నగిలి అతి నీరసము, రక్తపుపోటు ఉండవలసినదానికంటె చాల తక్కువగా నుండుట, స్పృహతప్పుట మొదలయిన లక్షణములు కలిగినవారికిని ఈ రక్తదానము అత్యవసరమై యుండును. ఇట్టి ప్రమాదావస్థలలో ప్రాణ రక్షణము చేయుటకు సరియైన రక్తమును ఎక్కించుట కంటె బాగుగా పనిచేసెడి ఔషధమేదియును లేదు. అందుచేత ఈవిషయమును గుర్తించి ఉదారులగు వారు తమ రక్తమును ఆసుపత్రులలో నుండెడి రక్తపు బ్యాంకులలో దానము జేయుట ఎంతయో గొప్ప విషయము. ఆసుపత్రి అధికారులైన డాక్టరులుకూడ ఇట్టి దాతలను జాగ్రత్తగా పరీక్షించి ఆరోగ్యవంతులైన ఒక్కొక్కరి వద్దనుండి సాధారణముగా 300 ఘనసెంటీమీటరుల రక్తమునుమాత్రము గ్రహించి ఆబ్యాంకులలో నిలువజేయుదురు. ఈమాత్రము రక్తముతీసివేసినచో ఆరోగ్యవంతునికి ఏమియు నష్టములేదు. కొద్దిరోజులలోనే ఈ నష్టము అతని శరీరములో భర్తీ అయిపోవును.

## 10 ఎల్లెర్జీ

'ఎల్లెర్జీ' అను వ్యాధి విషయమై అందరును తరుచుగా ముచ్చటించుకొనుట పరిపాటి అయినది. కాని, అంతమాత్రముచేత ఈ వ్యాధి పూర్వముకంటె హెచ్చుగా వ్యాపించుచున్నదని అనుకొనుటకు అవకాశము లేదు.

శరీరమునకు విజాతీయమైన పదార్థములతో, ముఖ్యముగా, విజాతీయమైన మాంసకృత్తులతో మొదటిసారి సంపర్కము కలిగినప్పుడు శరీరములో కొన్ని 'ఆంటి బాడీలు' అనగా ఒక విధమైన ప్రతిఘటన పదార్థములు పుట్టును. ఆ శరీరములోనికే, ఈ విజాతీయమైన మాంస కృత్తులుగాని, లేక వీనివంటి ఇతర పదార్థములుగాని మరియొకసారి పంపినచో, ఇంతకుముందే పుట్టిఉన్న ఆంటిబాడీలకును, ఈ ఆంటీబాడీలు పుట్టుటకుకారణమైన ఆంటిజెన్నులకును పరస్పరసంఘర్షణము కలుగును. ఈ ఆంటీబాడీల, ఆంటిజెన్నుల సంఘర్షణముచే శరీరములో 'హెస్టమిన్' అనెడి ద్రవ్యమువంటి పదార్థములు పుట్టును. దీనివలన అచ్చట నుండెడి

రి_క్తనాళములు సాగిపోవుట. ఏదో ద్రవము శరీరమునందలి ఒకస్థానము నుండి స్రవించుట సంభవించును. ఇట్టి ద్రవము స్రవించునట్టి ప్రదేశము మాత్రము మనిషికి, మనిషికి మారుచుండును. ఒకప్పుడు ఒకని శరీరము లోనే ఆ యా సందర్భములనుబట్టి, భిన్నమైన స్థానములలో పైని జెప్పిన స్థానిక స్రావము లుండుట సంభవించును. ఈ విజాతీయ పదార్థములు (ఆంటిజెన్నులు) ప్రతిఘటన పదార్థములు (ఆంటిబాడీలు) ఈ రెండును ఈ ప్రకారముగా సంఘర్షణ పొందిన స్థానము లేక అవయవమును సమ్మూర్ఛితావయవమని (shock organ) అందురు. కొన్ని వాసనలు (smell) వగైరాలు తగిలినప్పుడును, సముద్రపుగాలి మొదలయిన కొన్ని వాయువుల (ఇవి ఆంటిజెన్నులు) సంపర్కము కాని, విజాతీయమైన అన్యపదార్థములుకాని తగిలినప్పుడును,పగప్పు లేక శ్వాస - అమితముగా కలుగుచుండినచో అప్పుడు శ్వాసకోశ నాళములు సమ్మూర్ఛితావయవములని తెలిసికొనవలెను. 'ఇయోసినోఫీలియా' అనెడి కొన్ని ఉష్ణదేశపు వ్యాధులలో ఊపిరి తిత్తులలో నుండెడి చిన్న చిన్న సంచులు సమ్మూర్ఛితావయవములగును. ఏదైన కారణములచే దద్దుర్లు వచ్చినప్పుడు చర్మము సమ్మూర్ఛితావయవము. ఈ ప్రకారము ఈ ఏంటిజన్, ఏంటీబాడీలకు శరీరములో ఏ అవయవమైనను సమ్మూర్ఛితావయవము కావచ్చును. ఇట్టి ఒక్కొక్క సమ్మూర్ఛితావయవమునందు ఆ యా వ్యాధికలుగుటయే 'ఎల్లెర్జి' అని యందురు.

'ఎల్లెర్జి' వలన అనేకరకములైన వ్యాధిలక్షణములు భిన్న వ్యాధులవలె శరీరమునందు ఆవిర్భవించుచుండును. ఎల్లెర్జీవలన కలిగెడి భిన్నవ్యాధులలో శ్వాసకోశములయందు కలిగెడి 'పగప్పు' ఒకటియు, చర్మమునందు కలిగెడి 'దద్దుర్లు' ఒకటియు తరుచుగా కాన్పించుచున్నవి. వైద్యేతరులుకూడా ఈ వ్యాధిని తరుచు చూచుచుందురు. సామాన్యముగా

శ్వాసకోశములందు వగర్పువలన రోగి రాత్రి పరుండబోవు నపుడు ఏబాధయు లేకుండ మామూలుగానే పరుండి. తెల్లవారుఝామున ఊపిరి అందుట లేదని ఆయాసముతో బాధపడుచు లేచికూర్చుండును. ఈతనికి కలిగెడి శ్వాసకోశ ధ్వనులు (వీనినే పిల్లికూతలందురు) ఆ ఇంటిలోని వారికేగాక ఒకప్పుడు చుట్టుప్రక్కల ఇండ్లవారలకు కూడ వినబడు చుండును. ఇచ్చట డాక్టరు పరీక్షించి తెలుసుకొనవలసినదేమనగా: ఈ వగర్పు మొదలయిన లక్షణములే, సరిగా ఇట్లే, ఇంకను కొన్ని వ్యాధులలో కూడ కనబడుచుండును. అందుచే శ్వాసకోశములయందు వగర్పు మొదలయునవి ఇంకొకవ్యాధి యొక్క లక్షణములు మాత్రమే; కాని అవే వ్యాధి కాదని గ్రహించవలెను. అనగా 'ఎల్లెర్జి'యే గాక ఇతర కారణములు కూడ వగర్పు. ఆయాసము మొదలయిన లక్షణములను పుట్టించును.

'దద్దుర్లు' అనెడి వ్యాధిలో ఈ దద్దుర్లు శరీరములో ఎర్రగా పైకి లేచి దమ్మిడికాసు అంత ప్రమాణమునకూడ పైకి ఉబికి దురదతోకూడి యుండును.

(Angio - neurotic edema). సిరానాడీ శోధయనెడి వ్యాధికూడ ఈ ఎల్లెర్జీచే కలుగును. ఇందులో వాపులు ఎక్కువ దురద లతో కూడి యుండును. చర్మముపైన మాత్రమేగాక, ఇంకను లోతుగా కూడా వ్యాధియుండును. ఇందులో లక్షణము, అనగా వాపు, తరుచు స్థానము మార్చుచుండును. ఈ వ్యాధిలో ఒకప్పుడు గొంతుకలోనుండు స్వరపేటికలో శ్లేష్మము పుట్టుటచే రోగికి ఊపిరి తిరుగక చాలబాధ పడును.

'ఎల్లెర్జీ' వలన నీళ్ళ విరేచనములు, తలనొప్పులు, కండ్లు అంటుకొనుట, వాచుట, మొదలయిన లక్షణములు కలుగును. కాని ఇవి అంత తరుచుగా కానవచ్చుటలేదు.

'ఎల్లెర్జీ' వలన ఎనాఫిలాక్టిక్ రియాక్షను అనెడి సంఘర్షణము (anaphylactic reaction) శరీరములో సంభవించ వచ్చును. అనగా ఏంటిజెన్నులకు, ఆంటిబాడీలకు కలుగు సంఘర్షణములో, ఏంటిజెన్నుల దెబ్బకు ఆంటిబాడీలు తట్టుకొనలేక, చాల త్వరితమైన మార్పులతో అవి లొంగిపోవుట. ఈ సంఘర్షణవలన తక్షణ మరణము కాని, కొలది నిమిషములలో మరణముకాని కలుగవచ్చును.

ఎల్లెర్జీవలన ఇట్టి భిన్నవ్యాధులు, శరీరములో సంఘర్షణములు, ఏ విధముగా, ఏ శరీరధర్మ వికృతులచే, కలుగుచున్నవో ఇంకను శాస్త్రీయముగా అర్థముకాలేదు. ఈ ఎల్లెర్జీ వ్యాధులకు కొంతమంది మనుష్యులు, ప్రత్యేకించినట్లు గురి అగు చుందురు, ఒక్కొక్కప్పుడు ఒకకుటుంబములో ఎల్లెర్జీ వ్యాధులు కలుగుచుండును. కాని, ఆకుటుంబములో కాని, ఆ తరమువారికిగాని 'ఎల్లెర్జీ' ఒకే విధముగా నుండదు. మరికొంతమందికి కొన్ని కొన్ని వస్తువులు సరి పడక ఈ ఎల్లెర్జీ వ్యాధులు కలుగును. ఆధునిక నాగరికతలో అనేక విధములైన చిరుతిండ్లు వచ్చుట చేతను, ముఖమునకు రాచెడి స్నోలు, వాసిలైనులు, తలనూనెలు. ఫేస్‌పౌడర్లు మొదలయిన అలంకరణ సామగ్రులు, అనేక రకములుగా తయారయి ఉపయోగమునకు వచ్చుట చేతను, 'సల్ఫా' ఔషధముల వంటి క్రొత్తగా వచ్చిన అనేక రకముల 'ఆంటిబయోటిక్' ఔషధములు చాలచోట్ల హెచ్చుగాను, కొన్నిచోట్ల అనవసరముగా, అనగా వ్యాధితో నిమిత్తము లేకుండగాను, వాడబడుట చేతను, ఈ 'ఎల్లెర్జీ వ్యాధులు కలుగుచున్నవనినచో, ఇన్ని కారణము

లడే ఈ వ్యాధి ఇంకను హెచ్చుకాలేదేమి? ఆశ్చర్యమే కలుగుచున్నది. ఇట్టి ఎల్లెర్జీవ్యాధులు అంకురించినపుడు అనుసరించవలసిన పద్ధతులు అనేకములు కలవు. వీలైనట్లయితే అన్నిటికంటె ముఖ్యముగా, వ్యాధిని కలిగించు పదార్థములు ఆ మనుజునకు సంక్రమించకుండా జాగ్రత్త పడుటయే. ఈ ఎల్లెర్జీని పోగొట్టెడి చాల ఔషధములు నేడు మనకు లభ్యమగుచున్నవి. అయితే రోగి స్వయముగా తన ఔషధములను ఎంచుకొనుటకంటె, వెంటనే సరియైన డాక్టరును పిలిపించి ఆయన సలహాను పొందుటయే యుక్తమైన పని. కొన్ని ఎల్లెర్జీ వ్యాధులలో వైద్యుడు, చాల జరుగురుగా, కొన్ని చికిత్సా పద్ధతులను ప్రయోగించి బాధలను తగ్గించవలసి రావచ్చును.

## 11 పుట్టకురుపు (కేన్సరు)

కొంతమందికి శరీరములో అనేక భాగములలో కొన్ని కంతులు లేక గడ్డలు పుట్టుచుండును. ఈ కంతులు 'మందములు' (benign) 'దుష్టములు' (malignant) అని రెండు విధములు. 'మందములు' అనగా, శరీరములో ఎక్కడ పుట్టిన కంతులు అక్కడనే అట్లనే నిలిచి యుండునవి. 'దుష్టములు' అనగా, ఇవి పుట్టినచోటునుండి చుట్టుప్రక్కల ప్రదేశములకుగాని, ఎక్కడనో దూరముగా ఇంకొక అవయవములోనికి గాని వ్యాపించునవి. ఈ రెండవ రకమును, అనగా దుష్టమైన గడ్డలనే, కేన్సరు అని అందురు.

గర్భోత్పత్తిలో శిశువుగా ఏర్పడుచుండు కొన్నికణములు తప్పిపోయి ఎక్కడనో ఒకచోట గడ్డగా లేక కంతిగా ఏర్పడినచో, ఆ కంతి బిడ్డ పుట్టిన తరువాతకూడ అట్లే ఉండిపోవును. దానిని ఇంగ్లీషులో 'teratoma' యనియు 'dermoid' అనియు చెప్పెదరు.

కేన్సరు అనునది నిజమునకు కొన్నివ్యాధుల కూటమియని కూడ చెప్పుకొనవచ్చును. దాని విషయమై నేడు విశేషముగా పరిశోధన జరుగుచున్నది. ఈ వ్యాధి మనకు పూర్వకాలమునుండి వచ్చుచున్నది. అయితే, ఈ వ్యాధి సాధారణముగా నలుబదిసంవత్సరములు పైబడిన వారికే కలుగుచుండెడిది. ఔషధములు కనిపెట్టుటచేత చాల అంటు వ్యాధులు అదుపులోనికి వచ్చినవి. కాని, ఈ వ్యాధి విషయమై అట్లు కాకపోవుటచే, దీనివిషయమై ప్రసక్తి మనకు తరచు వినవచ్చుచున్నది. అమెరికాలో అనేక అంటువ్యాధులు, క్షయవ్యాధియుకూడ అదుపులోనికి వచ్చి, అక్కడ జీవిత ప్రమాణములు హెచ్చినను, కేన్సరు వలననే ఇంకను మరణములు హెచ్చుగా కలుగుచున్నవి.

మన శరీరమంతయు ఒక మోస్తరుగా నిర్మింపబడిన కొన్ని జీవకణముల (cells) కూడికయై యున్నది. ఈ జీవకణమే శరీర నిర్మాణమునకు ఒక ప్రాథమిక ఆధారము (యూనిట్) గా గ్రహించ బడుచున్నది. ఆ యా అవయవములుచేయు కార్య విశేషములను బట్టి ఈ కణముల నిర్మాణములో అనేక భేదములున్నవి. అనగా, ఈ కణముల నిర్మాణము చిన్నపనులు చేసెడి అవయవములలో సాధారణముగాను, క్లిష్టమైన పనులు చేసెడి అవయవములలో క్లిష్టము గాను ఉన్నది. ఈకణములన్నియు శరీరములో తమపనులను సహకరించి చేయుచున్నవి. ఇదియే ఆరోగ్యము. ఈవిధముగా ఆ యా కణములు తమ తమ పనులను నిర్వర్తించుచు, తమ పనికి తగినట్లుగా ఉండు ప్రదేశములో ఇంకొకవిధమైన కణము (వీనిని వికృతి కణములని చెప్పెదము) ప్రవేశించి, అచ్చటనే వృద్ధిపొంది, కంతులను సృష్టించును. ఇట్టి వికృతి కణముల సముదాయమే కేన్సరు లేక పుట్టకురుపు. ఈ వికృతి శరీరములో ఏచోటనైనను కలుగవచ్చును.

ఇట్టి వికృతికణములు వృద్ధిపొందుచున్నప్పుడు శరీరముపై ఒక పుట్టుమచ్చకూడ క్రమముగా దుష్టమైన కంతిగా మారిపోవచ్చును. చర్మము, పెదవులు, నాలుక, దవడ, మొదలయిన చోట్ల ఆమత్వచలలో (mucous membranes) కంతులు, ఒక్కొక్కప్పుడు వ్రణములు కూడ బయలుదేరి అవి మానకుండగా చిరకాలము ఉండి పోవుటవలన, అవి పుట్టకురుపులని స్పష్టమగును.

ఒక్కొక్కప్పుడు ఈ కురుపునకు పుట్టయొక్క ఆకారముండుట వలన దానికి పుట్టపురుపు అను పేరు వచ్చినది. ఇంగ్లీషులో దీనిని 'కేన్సరు' అని అనెదరు.

శరీరములో పుట్టిన ఇట్టి కంతులను ఔషధప్రయోగశాలలో శాస్త్రజ్ఞుడు పరీక్షించి, వీనిని అనేకవిధములుగా వర్గీకరణము చేయును. వీని కన్నిటికిని కేన్సరు అను పేరు ఉన్నను, అందులో ప్రత్యేక రకములకు ప్రత్యేక సూక్ష్మలక్షణములున్నవి. ఉదాహరణకు రసాయన గ్రంధులలో (lymph glands) పుట్టిన కంతులకు ల్యూకేమియా అనియు, (leukaemia) హడ్కిన్ వ్యాధి (hodgkin's disease) యనియు, 'లింఫోసార్కోమా' అనియు (lymphosarcoma) లేక కార్సినోమా (carcinoma) యనియు, ఆ యా కంతుల స్వరూప స్వభావభేదముల ననుసరించి పేర్లు ఉన్నవి.

రసాయనులలో ఉండెడి రసము వికృతిగ్రంధులలోనికి స్రవించుచున్నచో . ఆ వ్యాధికి (lymphosarcoma) అనిపేరు. వివిధమైన యీ కంతులలో నుండెడి కణములన్నియు ప్రత్యేకమైన ఆకారములు, భేదములు కలిగియుండును. సరియైన చికిత్సకు ఈ కణముల ఆకారము, వాని వికృతి మొదలయిన విషయముల నన్నిటిని అతి జాగ్రత్తగా తెలుసుకొనవలసి యున్నది.

శరీరములో ఏ భాగములోనైనను, ఏ అవయవమునకైనను ఈ కేన్సరు పుట్టవచ్చును. ఉదాహరణకు ఒక స్త్రీ స్తనమందు ఒక కంతిగాని, గట్టిగడ్డగాని ఉన్నచో, సాధారణముగా ఆగడ్డ కేన్సరు వలన కలుగుచున్నదనియే భావింపవలెను. ఇట్లు స్తనమందు గడ్డవలె ఏదో ఉన్నదనిపించినను, చాలమంది రోగులు అజ్ఞానమువలన దాని విషయమై సలహా చేయక ఉపేక్షించుచున్నారు. తేలికగా కనిపెట్ట గలిగెడి ఇట్టి కంతుల విషయమే రోగులు ఉపేక్ష చేయుచున్నచో, శరీరములో, లోపున, రోగికి డాక్టరుకుకూడా తెలియనంత గూఢముగా, ఎక్కడనో కంతిపుట్టినచో, అది ముదురువరకు తెలియుటలేదనుటలో ఆశ్చర్యములేదు.

దక్షిణ భారత దేశములో సాధారణముగా నోటిలో కేన్సరు హెచ్చుగా కలుగుచున్నది. నోటిలో తమలపాకులు, సున్నము, పొగాకు, వీని తమ్మెను నములుచు, నోటిలో చిరకాల ముంచుకొను వారికి ఇది కలుగుచున్నదని భావించుచున్నారు. ప్రస్తుతము నేటివరకు కేన్సరు విషయమై తెలిసిన శాస్త్రీయకారణములనన్నిటిని సింహావలోకనముచేయుట మంచిది. అయితే ఈ విషయమై పరిశోధన ఇంకను పూర్తికాలేదు. జంతువులకు చర్మముమీద తారుపూసినచోట్ల కేన్సరు పుట్టుట సంభవించినది. అందుచే శరీరములో ఏ అవయవములోనైనను సంఘర్షణము లేక ఒరపిడి (irritation) కలిగినచో అది కేన్సరుకు ఒక ముఖ్య కారణమని ఎంచవలసి యున్నది. అలాగుననే కొన్ని గనులలో పనిజేయు వారలకు, కొన్ని లోహముల రజనును, బూడిదను అచ్చట తప్పని సరిగాపీల్చవలసి వచ్చుటచే, ఊపిరితిత్తులలో వాని సంఘర్షణముచే కేన్సరు బయలుదేరును. ఎక్కువ చుట్టలు, సిగరెట్లు మొదలయిన వానిని పీల్చువారికి ఊపిరితిత్తులలో కేన్సరు కలుగుట నేడు నిర్వివాదాంశము. భిన్నదేశములలో, 13 ప్రత్యేక సుప్రసిద్ధ వైద్యశాలలలో, సుమారు

అయిదువేల మంది కేన్సరు రోగులమీద జరిగిన పరిశోధనల వలన పై విషయము నిర్ధారణ అయినది, ఇందులకై ప్రత్యేక యంత్రమును తయారుచేసి, అందు మోటారునుఅమర్చి,దానిచే ఒకేసారి 60 సిగరెట్లులు కాల్పించి, ఒక ప్రయోగము చేసిచూడగా, ఆ యంత్రమునందు కేన్సరును పుట్టించు శరీర వికృతి రూపమైన అంశమొకటి స్పష్టముగా కనిపించి నది. తారుద్వారా వచ్చెడి పొగను ఎలుకల మీదకు వ్యాపింప జేయగా నూటికి 44.4 ఎలుకల చర్మముల మీద కేన్సరును పుట్టించు అంశము కనిపించినది.

ఈ విధముగా ఆ యా అవయవములలో సంఘర్షణము లేక రాపిడిని పుట్టించు కారణమొకటియేగాక, ఒక్కొకవ్యక్తియొక్క శరీర ధర్మముకూడ కేన్సరుకు కారణము కావచ్చును. అయితే ఏయే శరీర ధర్మములు అట్లు కేన్సరును పుట్టింపగలవు- అను విషయము మాత్రము ఇంకను శాస్త్రీయముగా తేలవలసి యున్నది.

ఈ సందర్భములో నలుబది యేండ్ల వయస్సు పై బడ్డ వారికి చాలరకములైన కేన్సరులు పుట్టుటకు ఎక్కువ అవకాశము కలదను సంగతిని మనము మరువకూడదు, రాయివలె గడ్డకట్టు సార్కోమా, లింఫోమా మొదలయిన కేన్సరు వ్యాధులు చిన్నవయస్సు గలవారికి కూడ కలుగుచున్నవి. ప్రస్తుతము అణుశస్త్రముల ప్రభావమువలన కేనర్సు పుట్టవచ్చును. కాని ఆ విషయము ఇంకను నిర్ధారణ కాలేదు.

ఇప్పుడుశరీరములోపల గూఢముగా కలిగెడి కొన్ని కేన్సరు వ్యాధులను సమీక్ష జేయుదము.

పాశ్చాత్యదేశములలో ఆమాశయములో కలిగెడి కేనర్సు ఎక్కువ వ్యాప్తిలోనున్నది. హిందూదేశములో ఇట్టి కేన్సరు హెచ్చుగా

ఉన్నదా లేదా యను విషయము ఇంకను స్పష్టముగా చెప్పుటకు వీలులేదు. ఇచ్చట ముఖ్యముగా ఒకసంగతి జ్ఞాపక ముంచుకొనవలెను. నడి వయస్సుదాటినవారికి అంతవరకు జీర్ణశక్తి బాగుగానుండి, కారణము లేకుండగా అన్నహితవు, జీర్ణశక్తి పోయినచో, ఆ విషయమై డాక్టరుతో సలహా చేయకుండా ఉపేక్షింపరాదు. అలాగుననే కడుపు పైభాగములో నొప్పి, వికారము, వాంతి, అందులో రక్తముకూడ అప్పు డప్పుడు పడుచుండుట, పాండుత్వము, తూనిక తగ్గిపోవుట, పొట్టలో నొక్కిచూచినచో ఎక్కడనైనను చిన్న కంతివలెనుండుట, ఇట్టి లక్షణములు కలిగినచో వెంటనే కేన్సరు కాబోలునని అనుమానించ వలెను. ఆమాశయములో జీర్ణమగుచున్న ఆహారము మొదలయిన వానిని పరీక్షించుట, రోగియొక్క మలములో రక్తపు జీరలుఉన్న వేమో యని జాగ్రత్తగా పరీక్షించుట, బేరియం ఆహారమువిచ్చి ఆమాశయమును ఎక్సురే తీయించి చూచుట మొదలయిన పరీక్షలు ఆమాశయమునందు కేన్సరు ఉన్నదను విషయమును నిర్ధాణ జేయ గలవు.

పాశ్చాత్య దేశములో ఆమాశయములో కేన్సరు కంటె ఊపిరి తిత్తులలో కేనర్సు ఎక్కువగా కలుగు చున్నది. మన భారతదేశములో కూడ అట్లేయున్నదని చెప్పవలెను. ఏ యునకునికైన కొంచెము దగ్గు, రక్తము పడుట కలిగినచో అది క్షయవ్యాధి ఏమోయని ఎట్లు అను మానింతుమో, అట్లే ఈ కేన్సరు లక్షణములు పెద్దవారిలో కలిగినచో, సాధారణముగా కేన్సరు పుట్టుచున్నదనియే అనుమానించవలెను. ఇట్టి కేసులలో తెలివిగల డాక్టరు కేవలము లక్షణములను కనిపెట్టి కేన్సరు అని అనుమానించుటయేగాక, ఎక్సురేపరీక్ష, శ్వాస నాళికాదర్శనము, (Bronchoscopy) కల్లైను పరీక్షచేయుట మొదలయిన ప్రత్యేక

పరీక్షలను జాగ్రత్తగాచేసి వ్యాధి ముదరకముందే గుర్తించవలసిన ఆవశ్యకత కలదు.

స్త్రీలకు సాధారణముగా స్తనములలోను, గర్భాశయములోను ఈ కేన్సరు వ్యాధి పుట్టుచున్నది. స్తనములలో కేన్సరు విషయమై ఇప్పుడే కదా చర్చించి యుంటిమి. ఇక స్త్రీలకు యోనిలోనుండి ఎఱ్ఱ కుసుమ లేక రక్తస్రావము, వేరే ఏవిధమైన కారణములేక, వచ్చుచున్న దని తెలిసినచో, అది గర్భాశయములో లేక గర్భమార్గములో కేన్సరును సూచించెడి ఎఱ్ఱజండా వంటిదని తెలుసుకుని, స్త్రీలు వెంటనే పరీక్ష చేయించుకొనవలెను. ఆ స్త్రీయొక్క మర్మావయవములను జాగ్రత్తగా పరీక్షజేయుటయేగాక, ఆఎఱ్ఱకుసుమ లేక ఎఱ్ఱనిస్రావమును జాగ్రత్తగా పరీక్షించుట, అవసరమైనచో మర్మావయవమునుండి ఒక చిన్నతునుకను జాగ్రత్తగా చేదించి (biopsy) దానిని పరీక్షజేయుట మొదలయినవి జరుగవలెను.

పెద్ద ప్రేవులలో కంతులు లేక గడ్డలు కలిగినప్పుడు, రోగికి విరేచనము ప్రతిరోజును నియతమైన వేళకు అయ్యెడి అభ్యాసము మారి, జిగట విరేచనములు లేదా రక్తవిరేచనములు తరుచుగాకలుగుచు, తగ్గిపోవుచు, మరల కలుగుచుండును.

నాడీ శస్త్ర చికిత్స (neuro surgery) అను వైద్యశాస్త్ర విభాగములో ఈ మధ్య మస్తిష్కములో కలిగెడి కంతులను గురించి విశేష పరిశోధన జరుగుచున్నది. కారణము తెలియకుంద తల నొప్పి, వాంతులు, కంటి దృష్టిలో మార్పులు, వణుకుతో కూడిన కంపములు, రోగి వైఖరిలోను, మనస్సులోను మార్పులు, ఇవన్ని యును మస్తిష్కములో కంతికలదని సూచింపను. ఈ విషయమై చాల జాగ్రత్త అయిన పరీక్ష అవసరము.

కేన్సరు ప్రారంభములో, వీలయినచోట్ల జాగ్రత్తగా ఆ కంతిని లేక గడ్డను శస్త్రముతో ఛేదించి తీసివేయుటయే ముఖ్యమైన చికిత్స. జాగ్రత్తగా చేసినచో దానివలననే ఈ వ్యాధిని తరుణములో నశింప జేయుటకు సాధ్యమగును. అయితే ఈ కంతులు ఆ యా అవయవ ములలోను, చుట్టు ప్రక్కలను కూడ, అడ్డదిడ్డముగను, విశేషముగను వ్యాపించియున్నప్పుడును, వ్యాధిబాగుగా ముదిరినప్పుడును, శరీరములో ఇంకొకచోటకూడ ఈ వ్యాధియే అంకురించినదను అనుమానము ఉన్నప్పుడును, ఈ శస్త్రచికిత్స చేయుట యుక్తముకాదు. అందుచే తరుణములోనే ఈ వ్యాధిని గుర్తించి అవసరమైన చికిత్సను చేయించు కొనవలెనను ప్రచారము ఎక్కువగా చేయుట అవసరము.

ఇదిగాక, కేన్సరును కుదుర్చుటకు లోతుగా, గాఢముగా దిగెడి ఎక్సుకిరణములు (deep X-ray therapy) కోబాల్టు చికిత్స, రేడియం సూదులు, రాడాను ప్రయోగము మొదలయిన 'చికిత్సా ప్రక్రియల'ను అవసరమైన శస్త్రచికిత్సను చేసిన తరువాత ఉపయోగించ వలసి యుండును.

కేన్సరును మందులవలన కుదుర్చుటకు ప్రయత్నములు జరుగు చున్నవి. కాని నైట్రజను మస్టర్డు మొదలయిన ఔషధములను లోనికి ప్రయోగించుటవలన సుగుణములకంటె దుర్గుణములు హెచ్చుగా నుండుటచే అవి అంతగా ఉపయోగించుటలేదు. కేన్సరును కుదుర్చుటకు ఉపయోగించెడి మంచిఔషధము విషయమై పరిశోధనలు ఇంకను జరుగుచునే యున్నవి.

# 12 అభిఘాతములు - ప్రమాదములు

వ్యాధి అనేక కారణములవల్ల జనించుచు మానవుని బాధించు చున్నది. సూక్ష్మదర్శినీ యంత్రములో మాత్రము కానవచ్చు అనేక రకముల సూక్ష్మజీవులు, అందులోను గానరాని అత్యంత సూక్ష్మ జీవులు, చలిజ్వరము, జిగట విరేచనములు, కాలజ్వరము (kala azar) మొదలయిన వ్యాధులను పుట్టించెడి అనేకరకములైన క్రిములు - ఇట్టివి పలువిధములైన వ్యాధులను పుట్టించుచున్నవి. గ్రామ పారిశుద్ధ్యము, పరిసరముల శుభ్రత, జీవన ప్రమాణములు చాల తక్కువగా నుండెడి దేశములలో ఇట్టి వ్యాధులు హెచ్చుగా ప్రబలియున్నవి. వ్యాధికారకము లగు ఇట్టి సూక్ష్మజీవులను గురించి ఈ గ్రంథములో కొంతవరకైనను చెప్పుటతోబాటు, వ్యాధి కలుగజేయు ఇతరకారణములను గూడ ప్రస్తావించుట అవసరము. ఈ అధ్యాయములో సాధారణముగా కలుగు కొన్ని ప్రమాదములచేతను, అభిఘాతము (accidents) (దెబ్బ) ల చేతను కలిగెడి వ్యాధులను గురించి చెప్పుకొందము.

మనిషి పుట్టినపుడే ఆతనికి మొదటి అభిఘాతము కలుగుచున్నది. పుట్టిన యిల్లు, ధనవంతులదా? పేదవారిదా? అను విషయమునుబట్టి ఆతని సౌకర్యములు నిశ్చయమగును. అభిఘాతమను పదమునకు విశాలమైన అర్థము చెప్పినచో, మనుష్యుని ఆరోగ్యమునకు మొదటి అభిఘాతము ఆతడు పుట్టిన యింటినిబట్టి యుండును. నాగరికత అభివృద్ధిపొందిన ఈ ఆధునిక యుగములో దేశములో అందరికి కూడ కావలసిన తిండి ఆరోగ్యము మొదలయిన సౌకర్యములు సమానముగా లభించవలయునని ఆదర్శముగా ఉపన్యాస వేదికమీద చెప్పుటయేగాని, ఎంత అభివృద్ధిపొందిన దేశములో నైనను ఈ ఆదర్శము ఇప్పటికిని సిద్ధించలేదు. సాంఘిక వైద్యమనెడి అధ్యాయములో ఈ విషయమును గురించి ఇంకను చర్చించెదము.

మధుమేహము, రక్తపుపోటు మొదలయిన వ్యాధులకు కారణములను చర్చించినపుడు ఈ వ్యాధులు వంశపారంపర్యముగా కూడ కలుగుచున్నవని చెప్పియుంటిని. అందుచే ఇట్టి వ్యాధులు జన్మతః కలుగకుండుటకు, ఆరోగ్యవంతులైన తలిదండ్రులకు సంతానముగా జన్మించుట తప్ప, వేరొక మార్గములేదు!

పుట్టిన సమయములో శిశువునకు మూడు విధములైన కారణములచే అభిఘాతము కలుగవచ్చును. (1)శిశువు యొక్క తల మిక్కిలి పెద్దదిగా నుండుట, (2) యోనిమార్గము మిక్కిలి సన్నముగా నుండుట, (3) పురుటి నొప్పులు, అనగా గర్భాశయ సంకోచవేగములు, చాల బలహీనముగా వచ్చుచుండుట. సాధారణముగా పురుడు వచ్చునపుడు ఆరోగ్యవతియైన స్త్రీకి ఈ గర్భాశయ సంకోచము మొదలయిన శారీరక క్రియలన్నియును సవ్యముగా జరిపోవును; ఆమె ఆరోగ్యవంతమైన శిశువును కనును. ఎక్కడైన ఒక్కచోట ఇట్లు

సవ్యముగ పురుడు రానప్పుడు, నిపుణుడైన ప్రసూతివైద్యుని సహాయము అవసరమైయున్నది. స్త్రీలు కడుపుతో నున్నప్పటినుండికూడ యుక్తమైన వైద్యసహాయము. సలహా ఉన్నచో, ప్రసూతి సమయములో పైవి జెప్పిన ఇబ్బందులు ఇంచుమించుగా రాకుండనే యుండును.

బాలునకు రెండు మూడేండ్లువచ్చి ఎక్కువగా ఆటలాడుకొను వయస్సులో అతడు కొన్నిరకములైన ప్రమాదములకు, అభిఘాతము లకు గురి కావచ్చును. పాశ్చాత్యదేశములలో ఆరోగ్య రక్షణ పద్ధతులు అభివృద్ధిపొందుటచే చిన్నపిల్లలకు అంటువ్యాధులు సోకకుండా చాలా ఏర్పాట్లు చేయబడినవి. అయినను, అచ్చట పిల్లలకు కొన్ని కొన్ని ప్రమాదములు సంభవించుచునే యున్నవి. ఇట్టి అభిఘాతము లనేకము లను మనము ప్రతిదినమును చూచుచునే యుందుము. పిల్లలు అక్క డక్కడ పడిపోవుటచే వారి ఎముకలు విరిగిపోవుచుండును. శిరస్సునకు తీవ్రమైన గాయము తగిలినచో అప్పుడు పుర్రెకు కూడ దెబ్బతగిలి బాలుని ప్రాణములకే ప్రమాదము సంభవింపవచ్చును. అప్పుడు వైద్యుడు, శస్త్రచికిత్సకుడు, ఎక్సురే ఫొటో గ్రాఫులను తీయువాడు- ఈ ముగ్గురును సంప్రదించుకుని, పరస్పర సహకారముతో చికిత్స చేయవలసి యుండును.

ఎక్సురే ఫొటో ఆధునిక వైద్యపరీక్షలో చాల ముఖ్యమైన స్థానమును ఆక్రమించుకొనినది. బాలుర వ్యాధులలో సరియైన పరిస్థితి తెలియుటకు ఈ ఎక్సురే ఫొటో అవసరమగుచున్నది. అభిఘాతములచే ఎముకలు విరిగినప్పుడు ఎక్సురే ఫొటో తప్పనిసరిగా తీయింపవలసి వచ్చును. విరిగిన ఎముకలను సరిచేయుట, నడక, చలనము మొదలయిన క్రియలకు అవసరమైన ఎముకలను, కీళ్ళను సరిజేయుట మొదలగు చికిత్సలలో ప్రావీణ్యమును సంపాదించిన వైద్యునికి అస్థిసంధాన

వైద్యుడు (orthopaedic surgeon) అందురు. అతడు ఇంకను అనేక వ్యాధులలో తగు చికిత్సచేయగలిగినను, అస్థిసంధానము అతని ప్రధాన నైపుణ్యమైయుండవలెను. ఏదైన దెబ్బతగిలి, అందుచే ఎక్కువ నొప్పి, వాపు చప్పున తగ్గకుండా ఉన్నట్లయితే, అలక్ష్యముచేయక, వెంటనే డాక్టరుని సలహా చేయవలసియున్నది.

శ్వాసనాళికలలో, అనగా ఊపిరి పీల్చు గొట్టములలో, అన్య పదార్థములు, అనగా రాయి, ముల్లు, నాణెములు, మొదలయిన వస్తువులు ప్రవేశించుట, ఇంకొకరకమైన ప్రమాదము. చిన్నపిల్లలు సాధారణముగా చేతికి దొరికిన వాటినన్నిటిని నోటిలో పెట్టుకుని మ్రింగుచుందురు. ఈ వస్తువులేగాక అన్య పదార్థము (దీనినే శల్యమని మన పూర్వులు అనెడివారు) గొంతుకలోనుండి ఆ మాశయములోనికి పోవచ్చును. లేదా తప్పు మార్గము ద్వారా శ్వాస నాళికలోనికి చేర వచ్చును. ఆమాశయములో చేరిన శల్యము కొంతకాలమునకు సాధారణముగా మలము (పురీషము) ద్వారా బయటికి పోవచ్చును. అట్టి సందర్భములో ఓయ్యపు పిండితో చేసిన మృదువైన వంటకములను (ఉండ్రాళ్ళు మొదలయినవి) అరటిపండ్లను ఆ పిల్లలకు తినుటకు ఇచ్చినచో అవి లోనికిపోయి ఆశల్యమును ఆవరించి, దానితోపాటు మలముగా బయటకు పోవును. ఇటువంటి విషయములో విరేచనౌషధము ఇవ్వకూడదు. దీనికి సాధారణముగా శస్త్రచికిత్స అవసరము లేదు. శ్వాస నాళికలలో శల్యముల విషయములో మాత్రము అట్లుకాదు. మన శరీరములో రెండు ఊపిరితిత్తులకును చెరియొక శ్వాసనాళికయును కలవు. ఏ శ్వాసనాళికలో శల్యము ప్రవేశించి అడ్డును కలుగ జేయునో, దానికి సంబంధించిన ఊపిరితిత్తులలో వాయువు సరిగా ప్రవేశించలేక పోవుటచే, అది ముడుచుకొనిపోయి ముడతలు

పడినట్లగును. ఇంచుమించుగ కొన్ని అంటువ్యాధులు కలుగుట మొదలయిన బాధలు కలుగవచ్చును. ఒక్కొక్కప్పుడు అసలు ఊపిరి తిరుగక బిడ్డ హఠాత్తుగా మరణించవచ్చును. అందుచే అట్టి సమయములో ఎంత మాత్రము ఆలస్యము చేయకుండా ఒక ప్రత్యేక యంత్రముతో ఆ శల్యమును జాగ్రత్తగా తీసివేయవలసియున్నది. అమెరికాలో ఫిలడల్ఫియా రాష్ట్రములో చెవి, ముక్కు, గొంతుక వ్యాధుల నిపుణుడైన జాక్సన్ అను సుప్రసిద్ధ వైద్యుడు ఈ మధ్యను ఇట్టి శల్యములను 2000 వరకు బయటకు తీసివేసెను. ఆ యా దేశములలో ప్రజల అలవాట్లు, చర్యలు బట్టి ఈ శల్యములుకూడ భిన్న భిన్నములుగా నుండును. మన దక్షిణదేశములో సాధారణముగా చిన్న పిల్లలకు తలి దండ్రులు పోకచెక్కల పొడుము నిచ్చెడి దురలవాటు ఉన్నది. ఆ చెక్కపొడుము చిన్నపిల్లల గొంతుకలో స్తంభించి శల్యముగా తయారుకావచ్చును. శ్వాసనాళికలో ఏదేని అన్య పదార్థము ప్రవేశించినపుడు పొరపోవుట (పొరమారుట) అను దగ్గు వచ్చును. దీనికి సరియైన పదము ఇంగ్లీషులో లేదు. చెక్కపొడుములో బాధ ఏమనగా, అది చిన్న చిన్న ముక్కలుగా నుండుటచే వానినన్నిటిని బయటకు తీసివేయుటకు సాధ్యముకాదు. మరియును ఆ ముక్కలు అచ్చట నాని, ఉబ్బి, ఆ నాళమును అంతకంతకు ఎక్కువగా అడ్డగించును. అందుచే ఎన్నడును, చిన్న పిల్లలకు చెక్కపొడుమును నములుటకు ఈయరాదు.

జలగండము (నీటిలోపడి మునిగి పోవుట) చిన్నపిల్లలకును పెద్దవారికినిగూడ తరచుగా కలిగెడి ప్రమాదము. యువకులు ఒకపుడు సాహసించి లోతు నీటిలోనికి పోవుచుందురు. యువకుడొకడు నదిలో స్నానము కొరకు వెళ్ళి, అచ్చట మునిగి చనిపోయినాడని దుర్వార్తలను తరుచు వినుచుందుము. చిన్న పిల్లలు అప్పుడప్పుడు

ప్రమాద వశమున అట్టి లోతులేని చిన్న చిన్న గుంటలతో పడినను, ఊపిరాడక మరణించుట కలదు.

ప్రయాణములో ప్రమాదములు ఏ వయస్సులోవారి కైనను కలుగును. మోటారుకారులు హెచ్చయినకొలది ఈ ప్రమాదములుకూడ హెచ్చుచున్నవి. రోడ్లమీద ప్రమాదములను గురించి వివరముల నిచ్చుటకు ఈ పుస్తకములో చోటులేదు. కాని, ప్రతి పౌరుడును రోడ్డు మీద నడుచునపుడు రోడ్డు నియమములను ఉల్లంఘించుటవలన తోడి వానికే గాక, తనకుకూడ ఎన్నో ప్రమాదములను బాధలను తెచ్చిపెట్టుటకు అవకాశమున్నదను సంగతి గ్రహించవలెను.

ఈ సంవత్సరములో మానవుడే బుద్ధిపూర్వకముగా తెచ్చిపెట్టు కొనుచున్న యుద్ధమువలని ప్రమాదమును, అణుశస్త్రప్రయోగములవలన బాధలను ఇచ్చుట చెప్పవలసియున్నది. ఆరోగ్యశాఖాధికారులు, సుశిక్షితులైన వైద్యులు ప్రజారోగ్యవిషయమై చేయవలసిన దంతయు చేసి, అంటు వ్యాధులు మొదలయిన వానిని అరికట్టి, ఈ ప్రపంచములో ఆరోగ్య స్థాయిని వృద్ధిజేసి, కొంతవరకైనను సుఖమును వృద్ధిజేయ వచ్చును. గాని, దేశములకు దేశములకుమధ్య సంఘర్షణములను, పోరాటమును వారు ఏ విధముగను తప్పింపలేరు, అందుచే ఇట్టి యుద్ధములను కల్పించు మానవులను ప్లేగువ్యాధికారకములైన సూక్ష్మ జీవులవంటి వారుగా ఎంచవలసియున్నది.

అణ్వస్త్ర ప్రయోగముచే కలిగెడి ప్రసారముచే (radiation) కలిగెడి అభిఘాతముల విషయమై పరిశోధన యింకను జరుగుచునే యున్నది. అట్టి జీవులచే కలిగెడి వ్యాధులు భిన్న భిన్నముగా నుండును. కొన్ని తీవ్ర పాండు రోగములు, రక్తములోని తెల్లకణముల వృద్ధి

మొదలయిన రక్త సంబంధి వ్యాధులు ఇంకను అనేక రోగములు ఇట్టి క్రొత్తజీవుల వలన కలుగుచున్నవి. ఆ మధ్య అమెరికావారు నాగసాకి, హీరోషిమా అను రెండు జపానునగరములపై ప్రయోగించిన అటంబాంబుల ఫలితముగా అనేకమందికి మరణమే కాకుండగా మరణముకన్న ఘోరమైన వ్యాధులు, బాధలు అనేకములు కలిగినవి.

అగ్ని దగ్ధవ్రణములనునవి శరీరము కాలుటచే కలుగును. చర్మము ఎరుపెక్కుట మొదలు, కాలిన ఆ శరీర భాగము చాలవరకు నాశనమగు వరకు- మధ్యలోనుండు ఏ వికారమైనను ఇందులో జనించును. కాలిన వెంటనే కలుగు పొక్కు లేక బొబ్బ మొదలు అనేక విధములైన తరహాలలోనుండు వ్రణ మేదియైనను అగ్ని దగ్ధముచే కలుగ వచ్చును. బీద వాండ్రయిన స్త్రీలు గుడిసెలలో వంటచేయునపుడు ప్రమాదముచే వారి చీరలు నిప్పంటుకొని కాలి అగ్ని దగ్ధ వ్రణములు కలుగ వచ్చును.

ఈ ప్రమాదములలో ఎక్కువగా స్పృహతప్పుట, రక్తపుపోటు తగ్గుట మొదలయిన లక్షణములు కలుగవచ్చును. సెయింట్ జాన్ అంబ్యులెన్సు బ్రిగేడు వారిచే ప్రచురించబడిన ప్రాథమిక చికిత్సల యొక్క ప్రబోధములు, ఇట్టి ప్రమాదములను అరికట్టుటకు ఎక్కువగా ఉపయోగించును. ప్రమాదములు సంభవించిన తరువాత మాత్రము సుశిక్షితులైన వైద్యుల చికిత్స కావలసి యున్నది.

వడదెబ్బచేతను, ఎక్కువ చలిచేతను కూడ కొన్ని ప్రమాదములు కలుగుట తరుచు సంభవించు విషయమే. స్వాభావికముగా చెమట తక్కువ పట్టువారికే ఇట్టి వడగాడ్పుల దెబ్బలు తగులుచుండును. దీనిచే మనిషి స్పృహతప్పిపోయి పడిపోవును. స్పృహతప్పుట అనునది అనేక

కారణములచే కలుగుటచే, అట్టిమనుజుని చూచినప్పుడు అది ఏకారణము వలన కలిగినదో తెలుసు కొనుటకుకూడ ఒకప్పుడు చాల కష్టముగా నుండును. ఇదే విధముగా ఉత్తరాదిని ఎక్కువ చలిప్రదేశములలో కొంతమందికి చలివలన కాలివేళ్ళ చివరలను రక్తప్రసారము సరిగా లేకపోవుటచేత తెల్లగా అయి, రేనాడ్స్ వ్యాధి (Reynaud's disease) కలుగుచుండును.

పై కారణములే గాక గాఢమైన రాసాయినిక ద్రవ్యములచేత కూడ ప్రమాదములు కలుగుచున్నవి. అగ్నివలన కలిగిన కాల్పులవలెనే గంధకామ్లము (గంధకద్రావకము) మొదలయిన రాసాయనిక ద్రవ్యములచేత కూడ దగ్ధవ్రణములు కలుగును. అదేవిధముగా ఏదైన భవనములు కూలుట మొదలయిన పెద్ద దెబ్బలవలన మనుజునకు శరీరములో మార్పులు కలిగి, అతని మూత్రపిండములు మొదలయిన విసర్జకావయవములు సరిగా పనిచేయక ప్రమాదపరిస్థితులు సంభవించ వచ్చును. అనేక రాసాయనిక ద్రవ్యములు పొరపాటున లోపలికి మ్రింగినపుడు, అవి విషములవలె ప్రాణములను తీయును. సారాయి కూడ ఒక విషవస్తువే. త్రాగుబోతులకు సాంఘికముగా కలుగు అమర్యాదయేకాక, నిత్యము శరీరములో 'బి' విటమిను లోపము హెచ్చుగా సంభవించుచున్నది. త్రాగుడుచే అతడు సరియైన ఆహారము తినడు. మరియు సారాయి అతని ఆమాశయములోని అమత్వచను, కాలేయమును కూడ పాడుచేయును. త్రాగుడు వలన కాలేయములో దుర్మాంసముతో కూడిన బిల్ల కలుగవచ్చును. అయితే కాలేయములో దుర్మాంసపుబిల్ల సారాయి త్రాగని వారికి కూడ ఇతరకారణములచే రావచ్చును. ఉష్ణదేశములలో 'ఎమీబా' యని అనబడెడి సూక్ష్మజీవి కాలేయమును పాడుచేయ వచ్చును (ఈ వ్యాధి ఉష్ణదేశములలో

హెచ్చుగా పెరుగుచున్నది), ఈ 'ఎమీబా' సూక్ష్మజీవి సంపర్కము వలన కాలేయములో విద్రధి, లేక కురుపు పుట్టవచ్చును. అట్లు కాలేయములో కురుపు పుట్టినవారికి త్రాగుడు అభ్యాసముకూడ ఉండినచో ఇక అతనికి మరణము తప్పదు. త్రాగుడు వలన వివిధమైన మానసిక వికారములుకూడ కలుగును.

సారాయియేగాక, ఇంకను కొన్ని వస్తువులు ఒకసారి అలవాటు అయిన తరువాత సాధారణముగా వదిలిపెట్టవు. ఇట్టివి - నల్లమందు, 'హీరోయిన్', 'కొకెయిన్' మొదలగు ద్రవ్యములు. ఇట్టి దురభ్యాసములు క్రమముగా హెచ్చుచున్నవి. 'పెతిడైన్' అనెడి ఔషధము( ఇదికూడ మార్ఫైను ఔషధమువలె మత్తుకలిగించుమందు)నకు దురలవాటుపడిన వారు ప్రపంచములో చాలమంది కలరు. అందుచేత వైద్యులు ఇట్టి ద్రవ్యములను ఔషధములుగా ఉపయోగించునపుడు, చాల జాగ్రత్తగా ఆలోచించి, తప్పనిసరి అయినప్పుడే, అదైనను కొద్దికాలము మాత్రమే, ఉపయోగించుచుండవలెను. ఒక్కొక్కప్పుడు వీనివలని నష్టములు తెలిసిన డాక్టరులుకూడ ఈ ఔషధములను ఇచ్చుట చాల శోచనీయము.

అమెరికాలో బార్బిట్యురేటు (barbiturate) అనెడి మత్తు ఔషధములు హెచ్చుగా ఆత్మహత్యలకు ఉపయోగపడుచున్నవి. ఎప్పుడైన ఒక్కొక్కడు ఈ ఔషధము హెచ్చు మోతాదు పుచ్చుకొనుట వలన మరణించుచుండుటయేగాక, లక్షలకొలది వ్యక్తులు నిద్రపట్టుటకై దీనిని ఉపయోగించుటకు అలవాటు పడుచున్నారు. కొన్నాళ్ళకు వారికి స్వాభావికముగ నిద్ర అసలుపట్టదు. అట్టివారు కొంచెమైనను నిద్ర పట్టుటకు ఈ మందులమీదనే ఆధారపడుచు బాధపడుచున్నారు. అమెరికాలో నిద్రాజనకములు, శాంతికరౌషధములు అను పేరులతో ఈ ఔషధ

ములే మిగిలిన ఔషధములకంటె ఎక్కువగా అమ్ముడగుచున్నవి. ఆధునిక నాగరికత విపరీతముగ అభివృద్ధియగుటవలన కలిగిన నష్టము లివి. ఇట్టి నాగరికత లేక, వెనుకబడియున్నా మనుకొనుచున్నవారు ఇట్టి విషయములకు అలవాటు పడరాదని హెచ్చరిక చేయుట అవసర మగుచున్నది.

ప్రమాదముచే గాని, బుద్ధిపూర్వకముగా ఒక్కొక్క వ్యక్తిని చంపుదమను దురుద్దేశముతో గాని, ప్రయోగింపబడెడి రాసాయనిక విషములు చాల కలవు. సొంతవైద్యము చేసుకొనే వారికి ఒక్కొక్కప్పుడు ఔషధముల మోతాదు హెచ్చగుటచే కొన్ని కొన్ని ప్రమాదములు తటస్థించుచుండును. ఉబ్బసము, శ్వాస మొదలయిన వానిని అదుపులో పెట్టు నిమిత్తము పాషాణము మొదలయిన మందులను చిరకాలము తీసికొనుటచే, అవి శరీరములో చాలకాలము నిలువయుండి బాధించుచుండును.

మురికి కాలువలనుండియు, మోటారు కారులలో నుండెడి ఎగ్జాస్టుగొట్టములనుండియు వచ్చెడి కార్బను మోనాక్సైడ్ (carbon monoxide) అనెడి విషము ఊపిరి తిరగనీయకుండగా చేసి, నాడీ మండలములో కొన్నిమార్పులను కలుగజేసి మరణమును తెచ్చిపెట్ట వచ్చును. లోహ పరిశ్రమలో అనేకవిధములైన లోహముల సంపర్కము వల్లను, కొన్నిదేశీయములగు ఔషధముల వల్లను కూడ ఒకప్పుడు ప్రమాదము కలుగవచ్చును.

# 13 శైశవవార్ధక్యావస్థలు

బాల వ్యాధులు:—శిశువు లేక బాలుని రక్షణ, శిశువ్యాధి చికిత్స, ఈ విషయములో చాల అభివృద్ధి ఈ మధ్యనే జరిగినది. ఇందులకు కారణము లనేకములు కలవు. చంటిపిల్లలు తలి దండ్రులకు అత్యంత ప్రేమ పాత్రులు. వారు శిశువుల విషయమై ఖర్చుపెట్టి నంతగా, పెద్ద కుమారుల విషయమైగూడ ఖర్చుపెట్టరు. శిశుమరణములు ఎక్కువగా నున్న దేశములలో, సాధారణముగా బిడ్డలకు మొదటిసంవత్సరములోను, అందులోను మొదటి నెలలోను, జీవిత విఘాతమును కలుగజేయునట్టి సంఘటన లనేకములు తటస్థించుచుండును. చంటిబిడ్డ నోరులేని చిన్న పెంపుడు జంతువు వంటిది. తనబాధలను డాక్టరుతోగాని, ఎవరితోగాని చెప్పుకొనలేదు. పెద్దవారిలో కలిగెడి కొన్ని వ్యాధులు శైశవములో స్వాభావికముగా రావు గాని, ఈ శైశవావస్థలోనే కొన్ని చిత్రమైన పరిస్థితులవలన కొన్ని వ్యాధులు, ప్రమాదములు కూడ సంభవించు చుండును. అందుచే శిశువులయొక్క వ్యాధులను, ప్రమాదములను

అర్థము చేసికొనుటకు ప్రత్యేకమైన వైద్యవిద్య కావలెను. అట్టి ప్రత్యేక వైద్య శిక్షణపొందిన వైద్యుడే శిశువ్యాధి చికిత్సకుడు (Paediatrician) అనబడును. బిడ్డ పుట్టినప్పటినుంచియు, ముందుగా దానికి ఆహారము విషయమై జాగ్రత్త పడవలసి యున్నది. చంటి బిడ్డకు తల్లిపాలే అన్నిటికంటె ఉత్తమమయిన ఆహారమని అందరును అంగీకరించిన విషయము. అందుచే ప్రతి తల్లియు, తన బిడ్డలకు స్వయముగా పాలిచ్చుటయే ప్రథమ ధర్మము. ఏదైన కారణముచేత తల్లిపాలు లేకపోయినచో, శిశుపోషణకు పోతపాలు అవసరమగు చున్నవి. ఇట్లు తప్పనిసరిగా పోతపాలు ఉపయోగింపవలసి వచ్చి నప్పుడు, ఆ శిశువుకు ఆవుపాలనో, లేదా బజారులో అమ్మెడి డబ్బాపాలనో, అలవాటు చేయుటకు కొంత కష్టపడవలసివచ్చును. అందు చేత శిశువునకు సరిపడు పాల విషయములోకూడ, శిశువైద్యనిపుణుని అడిగి సలహా పుచ్చుకొనవలెను.

పెద్దవారికి కలుగు వ్యాధులు ఒక్కొక్క దేశములో ఒక్కొక విధముగా నున్నట్లుగానే, చంటిపిల్లల వ్యాధుల విషయమైకూడ పోషణ, చికిత్స మొదలయిన సమస్య లనేకములు ఆయా ప్రదేశము లను బట్టి మారుచుండును. మన భారతదేశములో అంటువ్యాధులు శిశువులను ఎక్కువగా పీడించుచు, హెచ్చు శిశుమరణములకు కారణము లగుచున్నవి. చంటిబిడ్డలకు కలిగెడి నీళ్ళవిరేచనములవలన శిశు శరీర ములో నుండెడి ఉదక ధాతువు హెచ్చుగా పోవుట వలన, హెచ్చు నీరసము వచ్చి, చలువలు క్రమ్మి, వెంటనే యుక్తమైన ఔషధ ద్రవములను ఎక్కించనిచో చాల ప్రమాదము కలుగుచున్నది. ఇట్టి పరిస్థితులలో పెద్దవారికి ఇట్టి ఔషధ ద్రవములను ఎక్కించుట సుకరము. శిశువులకు వానిని ఎక్కించుట ఒకప్పుడు చాల క్లిష్టమైన సమస్య

యగుచున్నది. ఈ విషయమై సరియైన శిక్షణ, అనుభవముకూడ శిశు వైద్య నిపుణులు సంపాదించి యుండవలెను.

మన దేశములో క్షయవ్యాధియే అనేకమంది శిశువులను ఎత్తు కొని పోవుచున్నది. సాధారణముగా శిశువులకు క్షయవ్యాధి వచ్చినట్లు పైకి తెలియకుండగనే మరణములు సంభవించుచున్నవి.

ఇతర దేశములలో శిశువుల మరణములకు హెచ్చుగా కారణ భూతములైన అంటువ్యాధులు అదుపులోనికి వచ్చినవి. కాని, అచట అనేక ప్రమాదములు, అభిఘాతములు శిశుమరణమునకు కారణములగు చున్నవి. శిశువులు ఏయే ప్రమాదములకు తరుచుగా గురియగుచుందు రను విషయము ఇంకొకచోట చర్చింపబడినది.

మందిచ్చి వ్యాధి కుదుర్చుటకన్న, రోగము రాకుండ నిరోధించి ఆరోగ్యమును రక్షించుటకు ఆచరణలో శ్రద్ధచూపువారిలో మొదటివాడు శిశువైద్యనిపుణుడు. అనేకశిశువైద్యశాలలును, శిశువైద్యకేంద్రములును గూడ శిశురక్షణ మున్నగు విషయములపై చేసెడి శాస్త్రీయమైన సలహాల ప్రచారము మీదనే ప్రజారోగ్యము హెచ్చుగా ఆధారపడి యున్నది. పెద్దవారు అప్పుడప్పుడు తమ ఆరోగ్యపరిస్థితి విషయమై పరీక్ష చేయించుకొనుట కూడ ఈ శిశురక్షణ ప్రచారముయొక్క అనుకరణమే యని చెప్పవచ్చును.

శిశువులను కొన్ని వ్యాధులనుండి రక్షించుటకై, టీకాల విషయమై కూడ శిశువైద్య నిపుణులు ఎక్కువగా కృషిచేసి యున్నారు. ఇట్టి వ్యాధులు ముఖ్యముగా ధనుర్వాతము, డిఫ్థీరియా, కోరింతదగ్గు, క్షయ మొదలయినవి.

వార్ధక్యదశలో వ్యాధులు:— మానవులకు ముసలితనములో, ఆదశననుసరించి కొన్ని వ్యాధులు కలుగుచుండును. ఇంతవరకు ఇతర

వయస్సులన్నిటి యందును శరీర భాగములలో కలిగెడి వ్యాధులను గురించి కొంతజెప్పితిమి, కొన్ని వ్యాధులు ఒక్కొక్క వయస్సునందే విశేషముగా కలుగుచుండునను సంగతి ఆ యా వ్యాధులను చర్చించు నపుడు నిర్దేశించితిమి. అయితే ఇవన్నియు అయిన తరువాత, వార్థక్య దశగురించి ప్రత్యేకముగా చెప్పుట ఎందుకని ప్రశ్నరావచ్చును. ఇందుకు సమాధానమేమనగా, రోగము ఏదియును లేకున్నను, వ్యాధిలక్షణములేవీ కనిపించకున్నప్పటికిని, కేవలము ముసలితనమువలన కొన్ని ఇబ్బందులు కలుగుచునే యుండును. ఈ ఇబ్బందుల వలన వార్ధక్యదశలో మానవుడు, అడుగడుగునకు ఇతరుల సహాయము లేనిదే తనంతట తాను కాలక్షేపము చేయలేడు. పైగా ఈ మధ్య శాస్త్రాభివృద్ధిచే జనుల ఆయుః ప్రమాణము వృద్ధిపొందిన దేశములలోని జనాభాలో, ముసలివారి సంఖ్య ప్రతి సంవత్సరము పెరుగుచున్నది.

దీర్ఘ కాలము జీవించుటకు అసలు శరీరతత్వములోనే ఉన్న ప్రకృతి కారణమనియు, ఉదాహరణకు కొన్ని కుటుంబములలో వ్యక్తుల సగటు జీవిత పరిమితి మిగిలిన వారికంటె చాల హెచ్చనియు—చెప్పెడి వాదము ఒకటి కలదు. అందరూ అంగీకరించిన ఇంకొక విషయ మేమనగా : ప్రపంచ మంతటను పురుషులకంటె స్త్రీలు దీర్ఘాయుర్దాయ వతులై యున్నారని. ముసలివానికి శరీరబలము, కంటిచూపు, వినికిడి శక్తి, మొదలయిన ఇంద్రియ సామర్ధ్యములు, ఆలోచనాశక్తి మొదలయిన శక్తులు ఏ ప్రకారముగా నుండునదియు ఇంచుమించుగా అందరకును తెలియును ఇక, వార్ధక్యదశలో తీసికొనవలసిన జాగ్రత్తలు మొదలయిన విషయములను తెలియజెప్పు ఈ శాస్త్రము (geriatrics) యొక్క సలహాలను పాటించుట వలన ముసలివారి ఆయుర్దాయము యొక్క పరిమితి ఏమియును వృద్ధికాదు కాని, జీవించుయుండు కొంత

కాలములోను, మానవులు సుఖముగా నిశ్చింతగా జీవింపగలుగుదురు. ఈ శాస్త్రముయొక్క ఉద్దేశ్యము ఆయుర్దాయము పెంచుటకాదు; ఆనంద మును పెంచుట — అని గ్రహింపవలెను.

ఇంగ్లీషుభాషలో ఈవిషయమై అనేకగ్రంథములు రచింపబడినవి. వానిలో ఈ మధ్య ప్రచురింపబడిన మంచి గ్రంథము శ్రీ కెన్నెత్ వాకరుగారు రచించిన 'వయస్సును గురించి వ్యాఖ్య' (Commentary On Age) అను పుస్తకము. ఈ పుస్తకములో వార్ధక్యములో కలుగు అనారోగ్యమును గూర్చి కాక, వార్ధక్యములో ఆరోగ్యము గురించి తెలిసికొనవలసిన విషయములను ఆయనవ్రాసెను. మన దేశములో 55 ఏండ్ల వయస్సులోనే చాలమంది తాముచేయు ఉద్యోగమునుండి విరమించి ఫించను పుచ్చుకొనుచున్నారు. ఇంగ్లాండు మొదలయిన దేశములలోను, అమెరికాలోను.ఫించను పుచ్చుకొను వయస్సు 65 ఏండ్లు. ఈ విధముగా ఉద్యోగములనుండి ఫించను పుచ్చుకొనువారు ఊరికే కూర్చుండక, ఏదో ఇంకొకవిధమైన పనులపైనను చేయుచుండవలెను. పాశ్చాత్యదేశములలో ఇట్లు ఫించను పుచ్చుకొనినవారు పూర్వము మత సంబంధమైన గ్రంథపఠనయందు కాలక్షేపము చేసెడివారు. నేడు పాశ్చాత్యదేశములలో మతముల గురించి విశ్వాసము సడలిపోయిన తరువాత అట్టి గ్రంథములను చదువుటయందు కూడ ఆసక్తిని చూపక, ఇంకొక విధమైన పనిలేక, బాధపడుచున్నారని జంగ్ అను మానసిక తత్వవేత్తవ్రాయుచున్నాడు. అందుచేత, ఆధ్యాత్మిక తత్వము లోపించెడి కేవల భౌతిక నాగరితాభివృద్ధి మితిమీరకుండగా, భారతదేశము శ్రద్ధ వహించనిచో, ఆధ్యాత్మిక పురోగమనములో మన నాయకత్వమును గోల్పోవుదుము.

మామూలుగా సగటు జీవనప్రమాణము దాటి వార్థక్యదశలో పడిన మానవుని మరణమునకు - మధుమేహము, కేన్సరు, రక్తపుపోటు దానికి సంబంధించిన ఇతర వ్యాధులు మొదలయినవి హేతువు లగుచుండును. అందుచే ఈ వార్థక్యదశలో కలుగుఇబ్బందులు, వ్యాధులు, వాని నిరోధము, చికిత్స మొదలగు విషయములనుగురించి, హెచ్చుగా పరిశోధనకు ధనవ్యయము అమెరికాలో జరుగుచున్నందుకు ఆశ్చర్య పడనక్కరలేదు.

ఎనుబది యేండ్లు దాటినవారి నెవరినైన, వారి దీర్ఘాయుర్దాయము నకు, ఆరోగ్య సుఖమునకు హేతువులు ఏమి అని ప్రశ్నింపగా వారు ఒక్కొక్క విధముగా చెప్పుట వార్తాపత్రికలలో చూచుచునేయున్నాము. ఆ యా వ్యక్తుల సలహాలను అన్నిటిని పాటించుట కష్టమే యగును. కాని, సాధారణముగా చెప్పవలసినచో, వార్థక్యములో శరీరము ఎక్కువ బరువుకంటె, తక్కువ బరువుఉండుట, హెచ్చురక్తపు పోటుకంటె, తక్కువరక్తపుపోటు ఉండుట, ఇవి దీర్ఘాయుర్దాయమునకు మంచి చిహ్న ములు. వార్థక్యములో పరిశ్రమకంటె ఎక్కువ విశ్రాంతియే లాభదాయ కము.ఏక్రియలోను 'అతి' గా సంచరింపక అన్నిటిలోను మధ్యేమార్గము నవలంబించుటయే శ్రేయోదాయకమనియు, ఊరికే కూర్చుండక ఏదో ఉపయోగకరమగు పనిలో నిమగ్నుడగుట, లేదా సరదాగా ఏదో పనిపెట్టు కొనుట, ఆదుర్దాను వదలిపెట్టి మనస్సులో నిశ్చింతగా నుండుట, సరియైన వైద్యసలహా, సహాయముకూడ అందుబాటులోనుండుట, ఇట్టి పరిస్థితులు సుఖకరమైన దీర్ఘ జీవితమునకు తోడ్పడును. కాని, ఒకప్పుడు చుట్టు ప్రక్కలవారు అర్థముచేసికొనక పోయినను, సహ కరించక పోయినను అనుకూలత సిద్ధించదు. ముఖ్యముగా ఇట్టి విషయ ములలో తన కుటుంబమేగాక, ఆతడు నివసించు సంఘమంతయును వృద్ధునితో సహకరించవలయును.

# 14 రోగ నిదానమునకును చికిత్సకును సంబంధించిన సమస్యలు

మీరు ఏదైన ఆధునిక వైద్యశాస్త్ర గ్రంథమునకు ప్రారంభములో ఉన్న విషయసూచికను చూచినచో, అందులో చర్చించిన వివిధవ్యాధుల పట్టికయే ఒక వంద పేజీల వరకు అచ్చుపడియుండుట గమనించ వచ్చును. ప్రపంచములో ఇన్ని వందల రకముల వ్యాధులుండగా, మానవులు ఇంకను ఆరోగ్యవంతులుగా చాలకాలము గడుపుచున్నా రనెడి విషయమే మిక్కిలి ఆశ్చర్యమును కలుగజేయుచున్నది: మామూలుగా పొందికగా నడిచెడి మనుష్యుడు చాలరకములయిన అంటువ్యాధులను దరిజేర నీయడు. అంటువ్యాధుల శక్తి, పరిమితి, వానిని విరోధించు ఉపాయములు. పెంపొందవలసిన రక్షణశక్తి మొదలయిన విషయ బాహుళ్యము చాల చిక్కుగా నుండుటచే ఇచ్చట సంగ్రహముగానైనను. వానిని ఉదహరించుటకు అవకాశములేదు. ఇక అత్యంత సూక్ష్మ జీవులేగాక, ఎల్లెర్జీ, శైథిల్యము, అంతర్గ్రంథుల

స్రావ విశేషములు, కంతులు మొదలయినవి కలుగుట కారణము అనేకములు కలవు.

ఆరోగ్యముగల శరీరములో క్రియలు ఏవిధముగా నడుచుచున్నవి, వ్యాధిలో ఏ విధముగా మార్పులు ఎప్పుడెపుడు వచ్చుచున్నవనెడి విషయములను ప్రతివాడును కొంతవరకైనను తెలిసికొనవలయును. వ్యాధికి సూచకములైన బాధలను 'లక్షణము' అని (symptoms) అందురు. వ్యాధులలో సామాన్యముగా కలిగెడి ఇట్టి లక్షణములను గురించి చెప్పుటకుముందు శరీరమునకు గల సహజ ధర్మములను చెప్పవలెను. ఈ ధర్మములు ఆరోగ్యకర శరీరలక్షణములే అయినను, అవి ఒక్కసారిగా ఎక్కువయినను, లేదా తగ్గిపోయినను అది అనారోగ్యమునకు సూచనయని వెంటనే గుర్తించవలసియుండును. ఉదాహరణకు 'ఆకలి' అను శరీరధర్మమును పరిశీలించినచో, సరియైన సమయమునకు ఆకలివేయుట అనునది ఆరోగ్యమునకు చిహ్నము; కాని, అతి ఎక్కువ ఆకలి వేయుట, ఆకలి పూర్తిగా మందగించుట కొన్ని వ్యాధులను సూచించును.

ఇట్టి సహజమైన ధర్మము లేవియో, ఏవి వ్యాధికి సూచనలో చాలమందికి తెలియనే తెలియదు. భోజనమయిన తరువాత తేనుపులు రాకపోవుట వ్యాధికి చిహ్నమని కొందరు భావించుచున్నారు. ఇది ఒక దురభిప్రాయము. కొంతమంది రోగులు తమకు కొన్నాళ్ళ దగ్గు వచ్చెడిదని చెప్పుచు, "అది మామూలు దగ్గులెండి" అని, దగ్గు అనునది ఒక సహజ శారీరక ధర్మమునట్లును, డాక్టరుగారు ఆ విషయమై ఆందోళనపడకుండ ధైర్యము చెప్పుట తమపని యన్నట్లును, భావించి మాట్లాడుదురు.

డాక్టరు రోగిని పరీక్షించు నప్పుడు ముందుగా అతని వ్యాధి విషయమై పూర్వచరిత్ర, కుటుంబములోని సంఘటనలు, రోగి పుట్టినప్పటినుంచియు అతని పూర్వచరిత్ర, మొదలయిన అంశములను సమగ్రముగా అడిగి తెలుసుకొనుట చాల ముఖ్యము. ఇది సరిగా జరిగిన తరువాతనే రోగియొక్క శరీరావయవముల పరీక్షను చేయవలెను. మానవ వైద్యమునకు, పశువైద్యమునకు తేడా ఈ విషయములోనే ఉన్నది. మానవుడు తన బాధలను మాటలతో చెప్పగలడు; జంతువు అట్లు వ్యక్తము చేయలేదు. కొన్ని ఆధునిక వైద్యశాలలలో కూడ రోగి చరిత్రను సమగ్రముగా అడిగి తెలుసుకొనకుండగా, కేవలము రోగి శరీరమునే పరీక్షించి వ్యాధిని నిశ్చయించుట చాల విచారకరమైన విషయము.

అందరకును సాధారణముగా కలిగెడి వ్యాధి జ్వరము కనుక ఆ లక్షణమును మొదట చర్చించెదము. రోగి విశ్రాంతిగానుండినప్పుడు నాలుకక్రింద అధమము రెండు నిముషముల కాలమైనను థర్మామీటరును పెట్టి యుంచవలెను. 98.4 F డిగ్రీలు అను అంకె ఉండుచోట నార్మలు అను విషయమును చెప్పుటకు బాణము వంటి ఒక గుర్తు ముద్రింపబడి యుండును. కాని, ఎవ్వరికిని కూడ 'నార్మలు' అనునది 24 గంటలలోను ఒకే విధముగా నుండుట సంభవించదు. ఈ నార్మలు వేడిమి ఉదయము, సాయంకాలపు వేళలలో మారుచుండును. అంతేగాక, అతడు చేయుపనిని బట్టి, లేదా అతడు తీసికొనెడి విశ్రాంతిని బట్టి, కూడ నార్మలు మారు చుండును, శరీరవేడిమి నార్మలు మార్కు, అనగా బాణము మార్కు, దాటినచో, 'జ్వరము' వచ్చినదని చెప్పుదుము. ఆ జ్వరముతో కూడి యుండు ఇతర లక్షణములను బట్టి వ్యాధిని నిశ్చయించుటకు కొంత అవకాశము కలదు.

దగ్గు అను లక్షణము కూడ సాధారణముగా కలిగెడి బాధయే. ఇది సాధారణముగా శ్వాసనాళికలలోగాని, ఊపిరి తిత్తులలోగాని, హృదయములోగాని వ్యాధియున్నప్పుడు సంభవించుచుండును. ఇక ఏ పరిస్థితుల వలన దగ్గు వచ్చుచున్నదియును, ఆ దగ్గు ఏ విధముగా నున్నదియును, దానిలో పడెడి కళ్లె ఎట్లున్నదియును, ఎంతపడుచున్నది మొదలయిన విషయములన్నియును డాక్టరుకు తెలియవలయును.

శరీరములో ఎక్కడనైనా నొప్పి,లేక శూల కలిగినచో,సరిగా దాని స్థానము, దాని స్వభావము, ఆ శూల హెచ్చుటకు, తగ్గుటకు వలయు పరిస్థితులు, ఆ నొప్పిలో సంభవించెడి ఇతర లక్షణములు, నొప్పి తగ్గుటకు రోగి అంతకుపూర్వము పుచ్చుకొనిన ఔషధములు, అవలంబించినపద్ధతులు,వానివలనిఫలితములు, మొదలయిన విషయముల నన్నిటిని చెప్పవలయును. ఉదరములో గనుక శూలయున్నచో, ఆశూల భోజనమునకు పూర్వమా? భోజనమయిన తరువాతనా? సరిగా ఎన్నిగంటల తరువాత? ఆహారము మార్చినచో వచ్చుచున్నదా లేదా ? వాంతులు అగుచున్నవా ? అయినచో, వాంతిఅయిన తరువాత శూల తగ్గునా హెచ్చునా ? స్త్రీ రోగు లయినచో, ఋతురక్తము అగుట మొదలయిన అంశములతో ఈ శూల కేమయిన సంబంధమున్నదా ? ఇట్టి విషయములనన్నిటిని డాక్టరుకు చెప్పవలయును.

సాధారణముగా రోగి ఏదైన శూలవచ్చినపుడు సొంతవైద్యము చేసికొనుచుండును. ప్రస్తుతము బజారులో ఈ నొప్పిని అణచెడి ఔషధము లనేకములు విరివిగా అమ్ముచున్నారు.

ఏదైన నొప్పి కలిగినప్పుడు దానిని పుట్టించు కారణమును సరిగా తెలిసికొనిన తరువాత చికిత్స చేయించుకొనవలెను గాని, ఆ నొప్పికి

ఇట్టి మందులను వాడుట ఎంతమాత్రము మంచిదికాదు. ఈ విధముగా నొప్పులను అణచెడి మందులలో మార్ఫియా వంటివి రోగికి క్రమముగా అలవాటు అయిపోయి, ఆ దురలవాటును వదలుకొనలేని దుస్థితినికూడ తెచ్చిపెట్టును.

విశ్రాంతిగా ఉన్నప్పుడును, లేదా స్వల్పమైనపని జేయునప్పుడును వగర్పు వచ్చినచో, అందుకు, గుండె సరిగా పనిచేయకపోవుట కారణము కావచ్చును. లేదా ఈ గుణము శ్వాసకోశములకు సంబంధించిన కొన్ని వ్యాధులలో కలుగవచ్చును. అనగా న్యుమోనియా (శ్వాసనక జ్వరము లేదా ఊపిరితిత్తులలో వాపు), శ్వాసనాళికకు సంబంధించిన ఆయాసము, ఊపిరితిత్తులలో చిన్నచిన్న గాలిగొట్టములు లేదా చిన్నచిన్న సంచులు సాగిపోవుటచే కలిగెడి దగ్గు- అనునవి ఇట్టి వ్యాధులు.

శరీరములో కాలుసేతులు మొదలయిన వానిలో ఏదైనను పని చేయనిచో, ఆఅవయవమునకు సంబంధించిన నాడిలో వ్యాధియుండునని గ్రహించవలెను. మాటసరిగా రాకపోవుట, ఆయా అవయవములు తన ఇష్టము లేనిచే కదలుచుండుట, రోగి కొన్ని స్పర్శనాడులకు సంబంధించిన బాధలతో బాధపడుచుండుట, మూత్రము విడుచుటకు ఇబ్బందులు- ఇట్టి లక్షణములు నాడులలో వ్యాధి యున్నదని సూచించును.

ఒక్కొక్కప్పుడు రోగి క్రమముగా గాని, హఠాత్తుగా గాని స్పృహతప్పి పడిపోవును. దీనినే 'మూర్ఛ' అని అందురు. ఈపరిస్థితికి అనేక కారణములున్నవి. మధుమేహము, అపస్మారము, మూత్రపిండములు సరిగా పనిచేయకపోవుట, మస్తిష్క రక్తస్రావము, విషమును ప్రమాదముచే తీసికొనుట, ఉష్ణప్రదేశములలో చలిజ్వరము, వడదెబ్బ మొదలయిన భిన్నకారణములచే మూర్ఛకలుగును. ఒక్కొక్కప్పుడు ఈ మూర్ఛకు సరియైన కారణమును వెంటనే కనిపెట్టుట చాలకష్టము,

రోగి శరీరమును జాగ్రత్తగా పరీక్షజేయుటయేగాక, ఔషధప్రయోగ శాలలో కావలసిన పరీక్షలనుకూడ జరుగురుగా చేయవలెను.

రోగి స్వయముగా అనుభవించు లక్షణములేగాక, పరీక్ష చేయుట వలన వైద్యునకు మాత్రము తెలిసెడి గుణములు కొన్ని గలవు. హృదయములో కలిగెడి మర్మరు, అనగా మరమరధ్వని, (ఇది స్టెత స్కోపు పరీక్షచే తెలియును) సాధారణముగా నాడులలో కలుగవలసిన వేగములోను, ప్రతిఫలసంవేగములలోను(alterations in reflexes) మార్పులు, కాలేయము మొదలయిన అవయవములు వృద్ధినొందుట మొదలయినవి ఇట్టివి. ఈ గుణములు పరీక్షించు డాక్టరుకే తెలియును గాని, సాధారణముగా రోగికి తెలియవు. ఈ పుస్తకము వైద్యేతరులకు ఉద్దేశింపబడినది కావున పై జెప్పిన పరీక్షలు మొదలయిన వానిని ఇచ్చట చెప్పుటలేదు. ఈ పరీక్ష విషయములు డాక్టరులు మాత్రము నిర్ధారణ చేయవలసినవి.

అయితే, కొన్ని కొన్ని లక్షణములు డాక్టరులకే గాక ఇతరులకు గూడ, రాబోవు వ్యాధిని చూపించుచుండును. ఉదాహరణకు శరీరము మీద ఎచ్చటనైనను వాపు ఉన్నచో, అది వ్యాధియని రోగికి, డాక్టరుకు కూడ తెలియును. ఆ వాపు ఎక్కడ పుట్టినది, ఏ విధముగా వ్యాపించు చున్నది, నొప్పి, పోటు మొదలయిన బాధలు ఉన్నది,లేనిది మొదలయిన విషయములను డాక్టరుకు తెలియజెప్పవలెను. రోగి అట్లు తన బాధల నన్నిటిని చెప్పిన తరువాత, డాక్టరు కావలసిన పరీక్షలనుజేసి వ్యాధిని నిశ్చయించుకొనును.

రోగనిదానము (diagnosis ) నకు, రోగివచర్త్ర, రోగము యొక్కచరిత్ర, రోగిశరీరమంతటిని జాగ్రత్తగా పరీక్షింపగా తెలిసిన

విషయములు, లేబరేటరీలో రోగిని రక్తము మొదలైనవి పరీక్షింపగా తెలిసిన అంశములు, కొన్ని సందర్భములలో ఎక్స్-రే ఫొటోలవలన, ఇంకను అవసరమయినచో ఎలక్ట్రోకార్డియోగ్రామ్ మొదలయిన యంత్రముల సహాయమున జేయు పరీక్షలు, జీవరసాయన పరీక్షలు, మొదలయిన అనేక పనులవలన తెలిసికొనుటకు వీలయిన సమాచార మంతయు అవసరము. ఈ విషయముల నన్నిటిని కలిపి, ఆలోచించి, పొందికతో ఒక నిర్ణయమునకు వచ్చుటయే 'వ్యాధి నిదానము' అని చెప్పబడును. కొన్ని పరీక్షలు, అనగా ఎక్స్‌రేపరీక్షలు మొదలయినవి చేయవలసిన అవసరము అరుదుగా కలుగుచుండును. అయితే, ఆ యంత్రములు అవసరమునకు అందుబాటులో ఉండవలెను. నేటి నవీన పరిశోధనలవలన, క్లిష్టమైన అనేక వ్యాధులను గూడ ఖచ్చితముగ నిర్ణయించుటలో చాల సులువు మార్గములు ఏర్పడియున్నవి.

పాశ్చాత్యదేశములలో ఆసుపత్రులలో చనిపోయెడి రోగుల శవములలో నూటికి ఏబదింటిని శవచ్ఛేదన పరీక్షకు (postmortem examination) ఇచ్చినగాని ఆ ఆసుపత్రిని వైద్యకళాశాలకు అనుబంధముగా జేర్చుకొనరు. ఇట్టి శవచ్ఛేదన పరీక్షజేయుట వలననే వివిధ వ్యాధుల నిదాన నిర్ణయములను జేయుట చాల సుకరమైనది. శరీరరచనా శాస్త్రము (anatomy) శరీరప్రక్రియా విజ్ఞానము (physiology) జీవరసాయనశాస్త్రము (biochemistry) రోగ వికృతి విజ్ఞానము (pathology) మొదలయిన శాస్త్రముల ఆధారము లనుబట్టియు, ప్రతివ్యాధిని గురించిన విషయములను శవచ్ఛేదనజేసి ప్రత్యక్షముగా తెలుసుకొనుటను బట్టియు, ఆధునిక వైద్యశాస్త్రము మిగిలిన వైద్యవిజ్ఞానములకంటె హెచ్చు అభివృద్ధి గాంచినది.

ఎప్పుడైనను వ్యాధిని నిర్ధారణజేసిన తరువాతనే చికిత్సను చేయవలయును. అంతేగాని, రోగి బాధపేరుచెప్పగానే మందుఇచ్చివేసి, తరువాత రోగనిదానము చేయుట యుక్తముగాదు. ఏ డాక్టరు అయినను రోగము ఫలానా అని మనస్సులో నిశ్చయించుకొనిన తరువాత గాని సరిగా చికిత్సచేయలేడు కదా! ప్రస్తుతము, చప్పున వ్యాధి కుదరవలెనను తొందరలో అంటిబయోటిక్సు అనెడి ఔషధములు (పెన్సిలిను, సల్ఫా ఔషధములు మొదలయినవి) ముందు ఉపయోగించివేసి, తరువాత వ్యాధినిదానము సావకాశముగా చేయుచున్నారు.

ఇక వైద్యవిషయములో చికిత్స అనునదే అన్నింటిలోను ప్రధానాంగము. రోగికి కావలసినది అదే. ఏ డాక్టరు అయినను, రోగికి కలిగెడి గుణములను బట్టియే ఆతని శ్రేష్ఠత నిరూపింపబడుచున్నది. ఆధునిక వైద్యకళాశాలలో చదివిన విద్యార్థులకు అన్నిరకముల వ్యాధుల చికిత్సలను బోధింతురు. చికిత్సా విషయములో వారిపై పూర్తిగా నమ్మకము ఉంచ వచ్చును.

చికిత్స అనగా ముంముగా ఒక సీసాలో ఔషధము, ఒక ఇంజెక్షను యిచ్చుట మాత్రము కాదు. ఈ ఇంజెక్షనులు అంతకంతకు ఎక్కువయిపోవుచున్నవి. రోగి తీసికొనవలసిన ఆహారము విషయమై సలహాలు, ఎంత ఎట్టి విశ్రాంతిని తీసికొనవలసినది, బాధలను తగ్గించెడి వేడినీళ్ళ కాపడము, ఆవిరి పట్టుట మొదలయిన పద్ధతులు, మనస్సునకు ధైర్యము చేకూర్చుట, మొదలయిన క్రియాకలాప మంతయును ఈచికిత్స లోనే చేరును. తీవ్రవ్యాధులలో చికిత్సతోపాటు పరిపూర్ణ విశ్రాంతి తీసికొనుట అత్యవసరము. ఆ విశ్రాంతినే నేడు కొంతమంది సరిగా పాటించుట లేదు.

మనదేశములో కూడ అనేక విధములైన వైద్యపద్ధతులు కలవు. ఆధునిక వైద్యశాస్త్రము తప్ప మిగిలిన వైద్యపద్ధతులు సామాన్యముగా వ్యాధినిదానముకంటె చికిత్సకే హెచ్చు ప్రాధాన్యమును చూపుచున్నవి. ఈ వైద్య పద్ధతుల నవలంబించు వైద్యులు ఏవో కొన్నిసంగతులుఅడిగి వెంటనేచికిత్సను ప్రారంభించుచున్నారు. శాస్త్రీయముగా అభివృద్ధిజెందిన ఆధునిక వైద్యమును ఈ ఇతర వైద్యపద్ధతులు ఎన్నటికిని త్రోసివేయ జాలవు.

అప్పుడప్పుడు రోగి, ముఖ్యముగా ధనవంతుడైన రోగి, తనకు ఫలానావిధముగా చికిత్సను లేదా చికిత్స ప్రక్రియలను చేయుమనియు, ఫలానా ప్రక్రియలు పనికిరావనియును, వైద్యునికే ఆజ్ఞల నిచ్చు చుండును. ఆత్మశ్రేయస్సునుకోరు ఏరోగియైనను సరే ఇట్టి వైఖరిని అవలంబించుట ఎంతమాత్రము మంచిదికాదు. సుశిక్షితుడైన డాక్టరును నమ్మి ఆతడు చెప్పినట్లు చేయవలయును. ఇతర విషయములలో వలెనే వైద్యవిషయములలోగూడ మానవుల పద్ధతులు, వైఖరి,ఇష్టానిష్టములు, భిన్నభిన్నములుగా నుండును. కొంతమంది రోగులు ఎట్టి లక్షణములు బాధలు ఉన్నను వ్యాధి ముదురువరకు వైద్యుని సలహా చేయరు. మరి కొంతమంది ఒక్కవ్యాధి చికిత్సకొరకే వైద్యులను, వైద్యపద్ధతులను గూడ తరుచుగా మార్చుచుందురు. ప్రతి కుటుంబమును సరియైన వైద్యు నొకనిని కుటుంబ వైద్యునిగా నియమించుకొని, ఆతనితో తమకు కలిగెడి బాధలను వెంటనే చెప్పుచుండినచో, ఆతడు ఆకుటుంబములోని వ్యక్తుల ఆరోగ్య పరిస్థితులను తరుచు పరిశీలించుచు అవగాహన చేసి కొనుటచే, సరియైన సలహానిచ్చి, సత్వరారోగ్యమునకు హెచ్చుగా తోడ్పడును. ఇది అన్నిటికన్న మంచి పద్ధతి.

# 15 సాంఘిక వైద్య శాస్త్రము

సాంఘిక వైద్యమనునది ఈమధ్యనే బయలుదేరిన ఒక వైద్యాంగ విశేషము. ఒక్కొక్క వ్యాధియొక్క కారణములను తెలిసికొనుటకు ఆ వ్యాధిని అదుపులో నుంచుటకు, సామాన్యముగా వైద్యుడు కొన్నిమార్గములను అవలంబించును. ఆ వ్యాధికి కారణములను, పరిస్థితులను, సమాజము నంతటిని దృష్టిలోనుంచుకొని ఈ వైద్యాంగము ఆలోచించును. ఇంతవరకు వైద్యకశాల విద్యార్థి ఆయా వ్యాధులను గూర్చి తెలుసుకొనుచు రోగియొక్క వ్యాధినిగూర్చి 'ఏమిటి ఈ వ్యాధి యొక్క నిదానము?' అని మాత్రము ప్రశ్నించుకొని, ఆ వ్యాధి క్షయ వ్యాధియనియో లేక మెహవాతపు నొప్పులనియో చెప్పినచో అంతటితో సంతృప్తిపడి ఊరుకొనెడివాడు. ఆలాగుననే ప్రజారోగ్యశాఖలో పని జేయు వైద్యుడు లేక వైద్యవిద్యార్థి ఆయాప్రదేశములను శుచిగా నుంచుట, మంచినీటి సరఫరా, మురికిని చెత్తను తీసివేయు పద్ధతులు, అంటువ్యాధులను అరికట్టు మార్గములు- ఇట్టి కార్యములలో నిమగ్నుడయ్యెడివాడు.

నేడు ఔషధము నిచ్చు వైద్యుడు వ్యాధిని మాత్రమును నిర్దేశించుటయేగాక, ఆవ్యాధి రోగికి ఎందుకు కలిగినది, ఎప్పుడు సరిగా బయలు దేరినది, ఏ భౌతిక. మానసిక పరిస్థితులవలన ఆవ్యాధి జనించినది, ఇట్టి ప్రశ్నలకు సమాధానము చెప్పవలయును. ఉదాహరణకు క్షయవ్యాధిని చూచినచో, ఈ రోగికి క్షయవ్యాధి కలిగినది అని చెప్పినంత మాత్రమున వైద్యుని పని అయిపోదు, ఆ క్షయవ్యాధి ఆ రోగికే ఎందుకు రావలయును అను విషయమునకు కూడ సమాధానము చెప్పవలెను. ఇట్టి ప్రశ్నలకు సమాధానము చెప్పగలుగుటకు వైద్యుడు రోగులను తన ఆసుపత్రిలో పరీక్షించినంత మాత్రమున సరిపోదు. ఆ రోగియొక్క ఆర్థికసంపత్తి, ఆతని సామాజిక వ్యవస్థ, మొదలయిన విషయముల నన్నిటిని వైద్యుడు తెలుసుకొనవలయును. ఆరోగి ఇంటికి వెళ్ళి ఆ రోగిని ఎవరెవరు ఏవిధముగా కలుసుకొనుచున్నారో తెలుసుకొనవలెను. కేవలము ఆసుపత్రిలోనే రోగిని పరీక్షించి వ్యాధి నిదానము చేయుట అనగా, ఒక్క బొమ్మను (స్టిల్‌ను) చూచి సినిమా కథ నంతటిని గ్రహించుట వంటిది. శకుంతల, దుష్యంతుల బొమ్మను చూచినంతమాత్రమున అభిజ్ఞానశాకుంతలము కథ అంతయు తెలియునా? రోగియొక్క సాంఘికమైన, ఆర్థికమైన పరిస్థితుల నన్నిటిని గ్రహించి నేడు సాంఘిక వైద్యశాస్త్రము మిక్కిలి వ్యాప్తిజెందినది. మానవుని శరీరమునకు బాహిరమైన సర్వప్రపంచమును ఈ వైద్యాంగమునకు అవసర విషయములే అగుచున్నవి, ఆసుపత్రులలో రోగ నిదానమునకు శరీర వికృతి శాస్త్రము (Pathology) ఎట్లు ఉపయోగ పడుచున్నదో, అదేవిధముగా సాంఘిక వైద్యమునకు సాంఘికశాస్త్రము (Sociology) ఆర్థికశాస్త్రము, (Economics) గణాంక శాస్త్రము (Statistics) మొదలయినవి ఉపయోగపడుచున్నవి.

ఒక శతాబ్దము క్రిందట న్యూమన్ (Neumann) అను వాతడు వైద్యశాస్త్రము, యథార్థమునకు సాంఘిక శాస్త్రముల విభాగమునకు చెందునని చెప్పినాడు.

ఈ సాంఘిక వైద్యమున ఈ క్రింది విషయములు ముఖ్యముగా గణనీయాంశములుగా నుండును. ఈ శాస్త్రమునందు కృషి అభివృద్ధి అయినకొలదిని, ఇంకను ఇతర శాస్త్రములు ఇందులో జేరుటకు అవకాశము కలదు.

1. గణాంకశాస్త్రము :-

కేవలము ఫలానావ్యక్తి మరణించినాడని చెప్పుట వలన ఏమియు ఉపయోగములేదు. వైజ్ఞానికముగ అభివృద్ధిజెందిన అన్నిదేశములలో కూడ మరణములను గురించి విశిష్టముగా పరిశీలించెడి నివేదికలను, (reports) తయారు చేయుచున్నారు. ఏ వ్యాధిని అదుపులోనికి తెచ్చుట కైనను, ఆ వ్యాధివలన మరణించువారి సంఖ్య, వారి వయస్సులు, స్త్రీపురుషభేదములు, భౌగోళిక పరిస్థితులు, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు, వారి వృత్తులు, మొదలయిన వాని నన్నిటిని పరిశీలించవలెను.

2. ఆహారము : పోషణ :-

వెనుకటి అధ్యాయములో ఒక్కొక్క వ్యక్తి తినవలసిన ఆహారమును గురించి, అందులో లోపములు కలిగినచో వచ్చు వ్యాధులను గురించి, చర్చించుకొని యుంటిమి. కాని, ఆహార విషయము ఇంకను విశాలమైన సమస్య. ఆ యా ఆహారములను తినెడివారెవరు ? వారి కొనుగోలు శక్తి ఎంత ? తినవలసిన వారందరికి పోషణకు తగినంత ఆహారమును పెద్దమొత్తముమీద ఉత్పత్తిజేయుట, సరఫరా జేయుట, ఎట్లు ? డబ్బిచ్చి కొనగలిగిన వారికి, ఆ యా ఆహారములలో తమకు

సరిపడువానిని ఎంచుకొనుటకు అవసరమైన విజ్ఞానము కలదా? మొదలయిన విషయము లన్నిటిని ఆలోచింపవలయును. ఆహారమును ఉత్పత్తి జేయుటకు వ్యవసాయము ఎంత ముఖ్యమో, సాంఘికారోగ్యమునకు ఆహారమును గురించిన విజ్ఞానము అంతముఖ్యము. గత యుద్ధములో ఇంగ్లాండుదేశము ప్రభుత్వము ద్వారా ఒక ఆహారప్రణాళికను ప్రచారము చేసినది. దానివలన, అట్టి విధానములచే కలిగెడి సౌకర్యములు ప్రజలకు బోధపడినవి. దానిలో ప్రతిరోజును తినెడి ఆహారములో ఏ ఏ పదార్థములు అవసరము మొదలయిన విషయములన్నియు చెప్పబడినవి. ఈ ప్రచారమునకై ప్రభుత్వమునకు ఖర్చు ఎక్కువ అయిన మాట నిజమే. కాని ఇందువలన శిశుమరణములు, గర్భవతుల మరణములు, బిడ్డల తల్లుల మరణములు చాల తగ్గిపోయి. యుద్ధమునకు పూర్వముండెడి ఆరోగ్యపరిస్థితులు ఆదేశములో పునఃస్థాపింపబడినవి.

### 3. నివాస గృహములు:-

ధనమును సంపాదించువారు ఇంటియందు 24 గంటలలో ఎన్ని గంట లుండవలయును? స్త్రీలు, వృత్తినుండి విరమించి విశ్రాంతి పుచ్చుకొనెడి వృద్ధులు. చిన్నపిల్లలు, ఇండ్లలో ఎంతసేపు ఉండవలయును? మొదలయిన విషయములను సాకల్యముగా ఆలోచించినచో, మొత్తము జనసామాన్యమునకు కట్టవలసివచ్చు ఇండ్లయొక్క ప్రాముఖ్యత అర్థము కాగలదు. ఈ నివాస గృహనిర్మాణ విషయమై గూడ శాస్త్రీయమైన పద్ధతులను ప్రవేశపెట్టవలయును.

### 4. అంటువ్యాధులు:-

ఇప్పుడు అభివృద్ధి నొందిన దేశములలో కూడ,కొన్ని శతాబ్దులకు పూర్వము సాంక్రామిక రోగములు (అంటువ్యాధులు) హెచ్చుగా నుండెడివి. అవి నేడు తగ్గిపోయినవి. కాని ఆర్థికసంపదలేని దేశములలో

ఇంకను అవి వ్యాపించియున్నవి. మశూచికము, ప్లేగు, కుష్ఠురోగము మొదలయినవి ఇందుకు నిదర్శనములు. పాశ్చాత్యదేశములలో క్షయ వ్యాధి చాల మట్టుకు అణగి పోయినది. కాని భారతదేశములో అది నేటికిని ఒక సమస్యగానే యున్నది. భారతదేశము మొదలయిన దేశములలో అంటువ్యాధులను కలుగజేయు కారణములు, పరిస్థితులు మొదలయినవానిని గురించి ఆలోచించెడి పద్ధతి సాంఘిక వైద్యాంగములలో ఒక భాగమై యున్నది.

## 5. పారిశ్రామిక వైద్యము :

పరిశ్రమలు అభివృద్ధి నొందిన నేటికాలములో బొగ్గు, ఇనుము మొదలయిన గనులలోనుండు పనివాండ్రకు వారి పనియొక్క స్వభావమునుబట్టియు, వారు తప్పని సరిగా పీల్చవలసివచ్చు బొగ్గుపొడి, బూడిద మొదలయిన వానిని బట్టియు, వారి బీదతనము వలన తప్పనిసరి అయిన జీవిత పద్ధతుల వలనను, ధనికవర్గమువారు ఏర్పరుచు నియమముల వలనను, ఆరోగ్యము దెబ్బ తినుచున్నది. మంచి అభివృద్ధి ఉన్నదేశములలో పనివారికి ఇట్టి పరిస్థితులవలన అనారోగ్యము కలుగకుండ రక్షణలు కల్పింపబడినవి. ఈ విషయము లన్నియు పారిశ్రామిక వైద్యమునందే చర్చింప బడును.

ఒక వ్యక్తి చేయు వృత్తి, అతని మనస్సునకు, శరీరమునకు సరిపడుట - అతని ఆరోగ్యమునకు చాల అవసరము. ఎవని మనశ్శరీరములకు అనువైన వృత్తిని వాడు ఎంచుకొనుటకు - అతని వైద్యుడు, అతని ఉపాధ్యాయుడు, అతని తలితండ్రులు, సాంఘిక సేవకులు, ఇందరు సహకరించి తోడ్పడవలెను. ఈ విధమైన వృత్తి మార్గదర్శకత్వము విషయమై రష్యాదేశమున జరిగినంత కృషి మరేదేశమునను జరుగ లేదందురు.

## 6. మానసికశాస్త్రము : మనశ్శరీర వైద్యము :

వ్యాధిని కలుగజేయుటలో మనస్సునకు, శరీరమునకు గల పరస్పరసంబంధమును గురించి ఇదివరకు చెప్పియుంటిమి. సమాజ నిర్మాణమునకు, దానితో వ్యక్తికి గల సంబంధమును గురించి మనశ్శరీర శాస్త్రముకన్న సన్నిహితముగ చర్చించు శాస్త్రములేదు. మానసిక ఆరోగ్యమును సంగ్రహముగా వివరింపవలసి వచ్చినచో మానసిక ముగ పరిపూర్ణ ఆరోగ్యవంతుడైన వ్యక్తి :

(1) ఆత్మవిశ్వాసము గలిగి పరులను గౌరవించుచు తనశక్తిని తెలిసికొనినవాడు కాబట్టి, తనకుగాని, ఇతరులకుగాని, తాను ఉపకరించు విషయములో ఏ మాత్రము వెనుదీయడు.

(2) ఇతరుల అభిప్రాయములను గౌరవించును. వారి సహకారి ముతో పనిచేయును. పదిమందితో కలిసియుండుట ఆనందముగా భావించును.

(3) తన పనిని, క్రీడలను, తన కుటుంబ జీవనమును, సంఘ జీవనమును ఆత్మవిశ్వాసముతోను ఉత్సాహముతోను, నిర్భయముగాను ఎవరితోను గొడవ పెట్టుకొనకుండగా హాయిగా సాగించుకొనును.

## 7. వివాహము, సంతానము, జనాభా సమస్యలు :

వివాహము, సంతానాభివృద్ధి, జనాభా పెరుగుదల అనెడి విష యములను గురించిన సమస్యలకు పైన జెప్పిన సంగతులతో చాల మట్టుకు సంబంధముండును. వివాహము, స్త్రీపురుష సంబంధము లనెడి సమస్యలు నేటికాలములో ఒక్కొక్కప్పుడు చాల దుఃఖమును, మాన సికమైన బాధలను తెచ్చిపెట్టుచున్నవి. ప్రపంచములో కొన్ని దేశము లలో జరిగెడి వివాహములలో మూడవవంతు విడాకుల పద్ధతిమీద విడిపోవుచున్నవనిన, అచ్చట వివాహ వ్యవస్థలో ఏదో తీవ్రమైన లోపము ఉండవలయు ననిపించును.

పురోహితుడు జనన, వివాహ, మరణములు మూడు సందర్భములయందును అవసరమై యుండగా, వైద్యుడు జనన, మరణములు రెండు సమయములందే అవసరమని లోకోక్తి కలదు. కాని నేడు వివాహ జీవితము ఆనందదాయక మగుటకు కూడ వైద్యుడు చేయవలసిన సేవ ఎంతో ముఖ్యమైనదని గుర్తించుచున్నారు.

## 8. వైద్యసహాయమును విస్తరింపజేయుట :-

వ్యాధిని జయించుటకును, నిరోధించుటకును సాధించిన వైజ్ఞానిక విశేషములన్నియు ప్రపంచములో అందరికిని, మారుమూలల నున్నవారికి గూడ, అందుబాటు చేయుటకు తగిన అవకాశము లేకున్నచో ఇంత విజ్ఞానాభివృద్ధియు నిరర్థకమే యని చెప్పవలసియున్నది. అందుచే మనదేశములో వైద్యవృత్తి వ్యవస్థను ఏర్పరుచుటలో, రష్యను పద్ధతినా, బ్రిటీషు పద్ధతినా, లేవా అమెరికా పద్ధతినా ? దేనిని అవలంబించవలెను, అనెడి విషయము గురించి ఎంతయో ఆలోచన, పరిశీలన చేయవలసియున్నది. ఇతర దేశములందుండు పరిస్థితులను అన్నిటిని చూచి, వాని యందుండు మంచిని మాత్రము మనము గ్రహించవలయును.

సాంఘిక వైద్యవిభాగము ఇట్టి విశేషముల నెన్నిటినో సమావలోకనము చేయవలసి యుండుటచే, అందుకుగాను ప్రపంచమంతటను అనేక ప్రత్యేక సాంఘిక పరిశోధన సంస్థలు స్థాపింపబడి పనిచేయుచున్నవి. ఇంగ్లాండు దేశమున ఆక్స్‌ఫర్డులో ఉండెడి సాంఘిక వైద్య సంస్థ (Institute of Social Medicine) వీని కన్నిటికిని ఇంచుమించు మూలసంస్థ, అనికూడ చెప్పవచ్చును. ఈ సంస్థలలో సాంఘిక క్షేమమునుగూర్చిన అభిప్రాయములు కార్యరూపము దాల్చునటుల చేయుటకు అనువైన పద్ధతులను రూపొందించుటయేగాక, అనారోగ్య నివారణమునుగూర్చి పరిశోధించునట్లే, ఆరోగ్య పరిరక్షణమునుగూర్చి గూడ పరిశోధనలు చేయుదురు.